శ్రీసద్గురవేనమః.

# సుజ్ఞానరత్నావళియను

## వేదాంతకీర్తనలు.

ఇది శ్రీసద్గురు శిష్యపరంపరలో సుకంఠిత

పోశల - శేషాచలమునాయనివారిచేతను

తొల్లింటిపెద్దలచేతను

రచియింపంబడిన

౧౨౦. తత్వకీర్తనలను

చక్కగాపరిశీలించబడి

రాగతాళములతోడ

చెన్నపురి:

వె. నా. జాబ్లిముద్రాక్షరశాలయందు

అచ్చువేయించిప్రచురింపంబడియె.

మూడవకూర్పు ౨౦౦౦ - కాపీలు









Price 6 - Annas. వెల ౬ - అణాలు.

శ్రీసద్గురవేనమః.

# ప్రకటనపత్రిక.

శ్రీమచ్చెన్నపురమ్మునందు, పెద్దినాయనిపేట నాటుపిళ్ళారి గుడివీధి ఇంటిసంఖ్య (...)గల మందిరంబున,

| | వెలలు. | పోస్టేజి. |
|---|---|---|
| ఆం. టీ. తా. గురుగీత ... | ౧-౮-౦ | ౦-౧-౦ |
| శ్రీశివరామదీక్షితీయమను అచలగ్రంథం ... | ౧-౦-౦ | ౦-౦-౬ |
| షట్చక్రగుణతత్వ కందార్థ తాత్పర్యసహితం | ౦-౧౨-౦ | ౦-౧-౦ |
| శ్రీకృష్ణబోధామృతమను ౧౨-రాజయోగములు | ౦-౧౨-౦ | ౦-౧-౦ |
| షట్చక్రవర్తుల ఇంద్రజాలపుకథలు ... | ౦-౮-౦ | ౦-౧-౦ |
| శ్రీనశివభక్తసంవాదం ఆత్మతత్వమార్గము ... | ౦-౮-౦ | ౦-౧-౦ |
| శ్రీకృష్ణార్జునసంవాదరూపతత్వమార్గము ... | ౦-౮-౦ | ౦-౦-౬ |
| శుకపంచవింశతియను చిలుకచెప్పిన కథలు | ౦-౮-౦ | ౦-౧-౦ |
| భక్తవిజయంబను మహాపతివ్రతలకథలు ... | ౦-౬-౦ | ౦-౦-౬ |
| ఉషాపరిణయము ... ... ... | ౦-౬-౦ | ౦-౦-౬ |
| నృసుమహారాజు చరిత్రం ... ... ... | ౦-౪-౦ | ౦-౦-౬ |
| యోగానంద చరిత్ర ... ... ... | ౦-౪-౦ | ౦-౦-౬ |
| అద్వైతరహస్యం ... ... ... | ౦-౩-౦ | ౦-౦-౬ |
| ఆత్మవిలక్షణసారం ... ... ... | ౦-౩-౦ | ౦-౦-౬ |
| ఆంధ్రపంచీకరణము ... ... ... | ౦-౩-౦ | ౦-౦-౬ |
| నిర్గుణసురాయ శతకము ... ... ... | ౦-౧-౦ | ౦-౦-౬ |
| అచలగురుగీతాశతకము ... ... ... | ౦-౧-౦ | ౦-౦-౬ |
| బసవశతకం ... ... ... | ౦-౧-౦ | ౦-౦-౬ |

ఈరిజిష్టరు గ్రంథములన్నియు నీక్రిందసంతకముచేసిన వారియొద్ద విక్రయింపఁబడును.

ఇట్లు,

గ్రంథకర్త.

☞ పోకల - శేషాచలమునాయఁడు.

# విషయసూచిక.



ముందుఅచ్చువేయబడిన ౧౦౮ - తత్వకీర్తనలతోడ మఱల ౧౨-తత్వకీర్తనలు మేలుకొలుపులతోడ చేర్చఁబడి మొత్తం ౧౨౦ తత్వకీర్తనలు అచ్చుకూర్పించి ప్రచురింపంబడియె.



శిష్యుఁడు
వేంకట్రావు.



అచల గురుఁడు
పోకల - శేషాచలమునాయుఁడు



శ్రీసద్గురవేనమః.

# సుజ్ఞానరత్నావళియను

## వేదాంతకీర్తనలు.

---

శ్రీమద్వేదాంత ప్రవర్తకులును, సచ్చిదానంద స్వరూపులును, మహా యోగపురుషులును, అష్టాంగ యోగ సమాధి నిష్ఠా గరిష్ఠులును, జ్ఞాన విజ్ఞాన సంపన్నులును అయిన పెద్దలచేత రచియింపంబడిన తత్వకీర్తనలు.

పోతులూరి వీరబ్రహ్మముగారి కీర్తనలు.

(౧.)—రాగము నాదనామక్రియ - అటతాళము.

పల్లవి.

ఓంనమః శివాయసిద్ధమైనాపదవి - ఓంకారమేదిరా శౌరి ॥

అనుపల్లవి.

ఒనరుగా త్రికూట భ్రూమధ్య మందున్న వాడెవ్వడో చూడరోరి ॥

చరణములు.

అ ఆలు పదియారు అక్షరంబులకాది హారుడెవ్వడో చూడరోరి - అహంకారమను చిలుక హంసతో గూడుకొని ఆడించుచున్నాడురోరి ॥ ఓంనమ ॥ క ఖాలు పదిరెండు పర్వములుచేసుకొని కర్ణమేసుకచూడరోరి - కదిసిరేకులతుదను కాంతయొకటున్నది కరకంతు జేయుగురాయోరి ॥ఓంనమ॥ తథదధాయనె తత్వములమేలెఱిగి తలుపు తీ

నుకచూడరోరి - తెరతేర కాదు యీదేవాలయంబులో తే
టగానున్నాడురోరి ॥ఓంనమః॥ యరలవ నారాయణ పరబ్ర
హ్మమితడనుచు నీశ్వరీయీశ్వరుడురోరి-శివసహాయ నేశివ
పోతులూరయ్యసాక్షిగాయున్నాడురోరి ॥ఓంనమశ్శివాయ॥

(౨.)—రాగము ఇంగ్లీషువర్ణ మెట్టు.

పల్లవి.

శివపంచాక్షరిమంత్రం - పర - శివయోగులకే జపసూత్రం।

అనుపల్లవి.

అవిరళయోగంబందిన వారికి - ఆరింటిమీద చిద్రూపం ॥శి॥

చరణములు.

ఐదుముఖంబుల పెనగింది అయిదక్షరముల నమరింది
అయిదు అయిదులు యిరువైదైనై అఖండ తేజంబీ మం
త్రం ॥శివ॥ మూడుమాత్రోవలది సాకారం మూటి నడుమను
శ్రీకారం - చూచేదంతయు సాకారం చూపునిలిపితే నిరా
కారం ॥శివ॥ సుషుమ్నాంతమున గురుతేజం అష్టకమలమున
శివపూజం - వేయికమలమున మహాపూజం-గురువీరేశుని
ఘనతేజం ॥శివపంచాక్షరి మంత్రం॥

(౩.)—రాగము నాదనామక్రియ - ఏకతాళం.

పల్లవి.

ఎంతమంచిగురుడుదొరికెనే - ఓయమ్మలార ॥ఎంత॥

అనుపల్లవి.

ఎంతమంచి గురుడు దొరికె అంతరంగమందు నన్ను
చింతలేక గురునిపాదము చెంతజేరియుండుమననే ॥ఎంత॥

చరణములు.

కన్నులు వీనులుమూసి గాలిరాకపోకదెలిసి - పున్నమ వెన్నెలబైట కన్నుదెరచిచూడుమనె ॥ఎంత॥ పంచకోశము లుబాసి పంచముద్రలన్నిరోసి - పంచవింశతి తత్వమావల బట్టబైటజేరుమనె ॥ఎంత॥ పరముమహాత్ముడు బ్రహ్మమే నారాయణుఁడు- ధరలోశివపోతులూరిదైవరాయుడొక్కఁ డనె ॥ ఎంతమంచి గురుడు దొరికెనే ॥

(౪.)—రాగం కాంభోజి - అటతాళము.

పల్లవి.

చెప్పెదగురుమహిమ తెలసినంతటమీరు తెలుసుకొండి ॥

అనుపల్లవి.

విప్పిచెప్పగనేనెంతటివాడను - శరణంటివొప్పుకొండి ॥చె॥

చరణములు.

చింతమానుమీద చేమంతిపూశెను తెలుసుకొండి- ఆ చేమంతిమీదను చెంగల్వపూశెను తెలుసుకొండి ॥చెప్పెద॥ భూరుహమున రెండు పుట్టలుగలవయ్య తెలుసుకొండి- ఆపుట్టలలో రెండు పెనుబాములున్నవిపట్టుకొండి ॥చెప్పెద॥ పట్టుకొనినమీద పైగా రెండుగుండ్లు తెలుసుకొండి - ఆ గుండ్లమీద నొక్కగూబ కూర్చున్నది తెలుసుకొండి ॥చెప్పెద॥ మూడుమూలలపెట్టె మూతదీసె నేర్పు నేర్చుకొం డి - ఆమూతదీసితె పెద్దభూతము గనుపడును తెలుసుకొం డి ॥చెప్పెద॥ భూతమునెత్తిన జ్యోతియొక్కటికలదు తెలు సుకొండి - ఆజ్యోతి పరబ్రహ్మం శివపోతులూరయ్య తెలు సుకొండి ॥చెప్పెద॥ తెలిశినవారికి తేనెమామిడిపండు తె

లుసుకొండి - తెలియని వారికి విషముష్టిపండని తెలుసు కొండి ॥చెప్పెద॥

(౫.)—రాగం ముఖారి - ఏకతాళము.

పల్లవి.

ఊదెతిత్తులపైగానుండె - ఉన్మణితెలియర- ఓరన్నా ॥

అనుపల్లవి.

తిత్తులనడుమను చక్షులమీదను-చీకటిగొట్టర-ఓరన్నా॥ఊ॥

చరణములు.

చీకటిగొట్టను తోకనాలుక తీసుకలేపర-ఓరన్నా - తీసుకలేపితె కాకకుపాముచిఱునలేచుర - ఓరన్నా ॥ఊదె॥ శంఖుచక్రముల నట్టనడుమ ఆశేషునిలేపర- ఓరన్నా - ఓంకారించుకయున్నది పాము కొంకకలేపర-ఓరన్నా ॥ఊదె॥ ఆరుచక్రముల కావలయీవల లోపలవెలుపల-ఓరన్నా - ఆరుచక్రముల బెనుచుక పాము - అధోముఖంబై -ఓరన్నా ॥ఊదె॥ రెండుచక్రములు విడిబడియున్నవి కుండలిలేపర - ఓరన్నా - రెంటికిసూత్రము మలిచుట్టాక్క టెలేపె పోతులూరి వీరన్నా ॥ఊదె॥

(౬.)—రాగం ధన్యాసి - ఏకతాళము.

పల్లవి.

చిల్లర రాళ్లకు మ్రొక్కుచునుంటె -
చిత్తము చెడిపోను రేవోరే ॥

అనుపల్లవి.

చిత్తమందునచిన్మయజ్యోతిని - జూచుచునుండుటఃసరేసరే ॥

చరణములు.

ఒక్కప్రొద్దులనియెందుచునుంటె- ఒనరుగచెడుదువు-ఒరేఒరే - ఏకమైన యావైభవమూర్తిని జూచుచునుండుట-సరేసరే ॥చిల్లరరాళ్లకు॥ నీళ్లలోమునిగి గొణగుచు నుంటె నిలకడ చెడునుర-ఒరేఒరే - నిలకడనుండె నిర్మలజ్యోతిని జూచుచునుండుట-సరేసరే ॥చిల్ల॥ బాధగురువులపంచనుజేరితె భావముచెడునుర - ఒరేఒరే - భావమందున బ్రహ్మకాంతిని జూచుచునుండుట-సరేసరే ॥చిల్లర॥ భూములుఅడవులుతిరుగుచునుంటెబుద్ధులుచెడునుర-ఒరేఒరే-బుద్ధిలోవుండేపున్నమచంద్రుని జూచుచునుండుట-సరేసరే॥ చిల్లర॥ వీరయ్య చెప్పినవాక్కును నమ్మితె వివరము తెలుసును-ఒరేఒరే - వివరమందుండే విగ్రహమూర్తిని జూచుచునుండుట- సరేసరే ॥చిల్లర॥

(౭.)—రాగం జూయామాళవి - ఆదితాళము.

పల్లవి.

కాశికి పోవలెనాతీర్థము - మోసుకరావలెనా ।

అనుపల్లవి.

కాశితీర్థముకన్నులనున్నది-బేశికన్ను శివకాశిగనున్నది॥

చరణములు.

అంగములోపలను కుండలిసంగముదాపునను - గంగాయమున పొంగుచుపారగ - రంగుగనడుమను లింగముండగను ॥కాశికి॥ కోనకుపైగాను తీర్థస్నానగురియగాను-వే నుమరచి నీవుకానకతిరిగెవు - లోనవెదకి శివధ్యానము చేయక ॥కాశికి॥ భావములోపలను శివునితావు తెలియకను-

జీవగుణంబులు చిక్కువిడిచితా- జీవబ్రహ్మము తావుదెలిసి తె ॥కాశికి॥ వాశిగతనలోను - కాశి నివాసుడుండగాను - జేసిన పాపము బాసిపోవునని - కాశికిపోదురు నివాసుని గానక ॥కాశికి॥ పొందుగ ధరలోను వీర గోవిందు డుండ గాను - అందమైనగురు ఈశ్వరిపాదము - అంటితె కైలా సమందేయున్నది ॥కాశికి॥

(౮.)—కాంభోజిరాగము - అటతాళము.

పల్లవి.

నడిమికంటిలోన నారాయణుండున్నాడు - నాతులారా ।

అనుపల్లవి.

మడుగులో దీపము మరి వెలుగుచున్నది - మగువలారా ॥

చరణములు.

ఎడమ కుడుల నడుమ వెలుగుచు నున్నాడు వెలదులారా - ముడిబొమలసందున మెరియుచునున్నా డుముదితలారా ॥నడిమి॥ ఒడయనిముఖమందుపాడమినవాడమ్మ వనితలారా - పుడమిలోపలయాపుణ్యునిగానరె పూబోణులారా ॥నడిమికం॥ నీళ్లకుండల నడుమ నిక్షేపమున్నది - ననబోణులారా - నీళ్లలోమునిగి తనవ్రేళ్లుయెంచిన లేదు వెలదులారా ॥నడిమికం॥ వేళ్లుపారి లోకమంత నిండి నాడు అలివేణులారా - గోళ్లుపెంచుకయెంతొ గొణగినను లేదు కొమ్మలారా ॥నడిమికం॥ జంట నాగస్వరము లంటుక యున్నాడు జాణలారా - వాడంటితామర నీరంటనట్టున్నాడు అతివలారా ॥నడిమికం॥ మింటినడుమ మిథున శేషమై యు

న్నాడు బోటులారా - కంటిలోనము క్తికళలంటి పెనగు నె కాంతలారా ॥నడిమిక౦॥ తన్ను తా దెలిసిన ధన్యులకీపందు తరుణులారా- కన్నచోటనెఉన్న దికనియనుభవించ రేకాం తలారా ॥నడిమిక౦॥ కంది మల్లయపల్లె మందిరమున నుంది కాంతలారా-ఇందుధరగోవిందబ్రహ్మమై లలనలారా ॥నడి మి॥ అందముగాగురు-ఈశ్వరమ్మపాదమతివలాగా-చెందిన వారికి చేదోరకు యీపందు చెలియలారా ॥నడిమిక౦॥

(౯.)--రాగము ధన్యాసి - ఆదితాళము.

ప ల్ల వి.

యజ్ఞముచేసె సుజ్ఞానులకు-వేదోక్తవిధి తెలియరయా ।

అ ను ప ల్ల వి.

ఆగమసారము లనేక శబ్దము లన్నియు మునుతా నెరు గవలెగా ॥యజ్ఞము॥

చ ర ణ ము లు.

అగ్రజన్మమైనందుకు తనలో అగ్ని లేపి కూర్చుండ వలెగా- ముగ్గురికిపిండవుగ మూలజన్మములు ఘాలమందుశో ధింపవలెగా ॥యజ్ఞము॥ ఊదిఊదిపాయ్యాదేటప్పుడు వూ పిరిసమరసమెరుగవలెగా-సారంబగుసంసారసాధకులై చవి లోచవిగని తిరుగవలెగా ॥యజ్ఞము॥ కామక్రోధమను పశు వునుబట్టి కర్మద్వారమున కట్టవలెగా - కాకోజ్వాలలవాల లాడుచును యూలలుబాడుచునుండవలెగా ॥యజ్ఞము॥ మ నోబుద్ధిచిత్తాహంకారంబున మరిగినకడలు తరుగవలెగా- సుజ్ఞానస్రుక్కుగా నుడిబడికన్నుల చూపునమంటలు వ్రేల్చవ లెగా ॥యజ్ఞము॥ మగ్నత్వంబున అగ్నిలో వ్రేల్చ మనసు

క్రొవ్వుపారదీయవలెగా-సుజ్ఞానంబను సుబ్రాహ్మణులంద రుసుషుమ్నమందుసురతాగవలెగా ॥యజ్ఞ॥ సత్తుచిత్తు ఆనం దంబని యేచవిలో చవిగని తిరుగవలెగా-జాతినీతులు జన్మ మరణాదులబూతిభూషితోక్రొట్టవలెగా ॥యజ్ఞ॥ అండపిం డబ్రహ్మాండంబులు మూడుకుండలియని తానెరుగవలెగా - అంబరవీథిన రంభయూర్వశి దారిపీరగురుజేరవలెగా ॥యు॥

(౧౦.)—రాగము ఆనందభైరవి - చాపుతాళము.

పల్లవి.

పాదసేవకుడపాదరక్షకుడగురుపాదరేణువకుఅర్హుఁడను ।

అనుపల్లవి.

విన్నమాత్రమున జెప్పవచ్చితి నన్నలార మీరు దెలి యరయా ॥పాదసే॥

చరణములు.

ఆగమతంబిది యోగమతంబిది భోగమతంబిది యో గమయా - ఈవరాదుసంసారభారములు యిరవుగానుపర మెదుకరయా ॥పాద॥ తెలివిలోపల తెలివై యున్నది దేవ బ్రాహ్మణులై తెలియరయా - మీరు వేదబ్రాహ్మణులై తెలియరయా - అలయుచుసొలయుచు కామయోగులైరం భకళలపై చిక్కిరయా ॥పాద॥ సప్తకోటి మహామంత్రముల కుసారము-సారములో చవిచూడరయా-సారము దెలిసిన వారేబ్రహ్మస్థానమందునిలిచియుందురయా॥పాదసేవ॥ఉప శ్రుతివాక్యములుండ జూచుకొని జపమంత్రము మీరునలు పరయా - జాతినీతులు జన్మమరణాదులు వ్రాచివ్రాచి త్రో

ట్టరయా ॥పాదసేవ॥ వీరవాక్యమిది దార బోసితే యింద దుకొందరికందదయా - సంధి తెలియ నీవందమానవుఁలై బా టిగొట్టిరైచిక్కరయా ॥పాదసేవకుడ పాదరక్షకుడ॥

(౧౧.)—హిందూస్థాని రాగము - చాపు తాళము.

పల్లవి.

కనుమదగ్గిర పోయి - కదలకే మనసా ।

అనుపల్లవి.

కనుమ దాటిపోతె కలుగునె సేవా ॥కనుమ॥

చరణములు.

చెడుగుణంబుల జిక్కిచెడిపోకెమనసా - చేరిసద్గురుని సేవించవే మనసా ॥కనుమ॥ ఆలుబిడ్డలనమ్మి అల్లాడకె మనసా - ఆనంద యింటిలో ఆట్లాడవే మనసా ॥కనుమ॥ సంతకూటమిదిసతమెంచకె మనసా-సాగిపొయ్యేదారిసాధించవెమనసా ॥కనుమ॥ నీవు నేను అని నిక్కకె మనసా - నీలలోయద మధ్య నిలువవె మనసా ॥కనుమ॥ మూన్నాళ్లబ్రతుకిది మురియకె మనసా-ముక్తికాంతనంటి ముద్దాడవె మనసా ॥కనుమ॥ మంటికుండ యిది మతిచెడకె మనసా - మహానీయజ్యోతినిమరువకెమనసా ॥కనుమ॥ ఎప్పుడో యే వేళో మెఱుగవెమనసా - ఎఱుకలోని మెఱుక ఎఱుగవెమనసా ॥కనుమ॥ వీరయ్యదాసుని వాక్కువినవె ఓమనసా- వివర మెఱిగి నీకు వింతగనుమనసా ॥కనుమ॥

(౧౨.)—రాగము ఎరుకలకాంభోజి - అటతాళము.

పల్లవి.

దరిజేర్చు కడతేర్చు దాతవైతివి మాకుభీతులేటికి-ఓరామా।

అ ను ప ల్ల వి.

పరబ్రహ్మనిర్మాణమె మావూరు ॥ ఏవూరయ్యా ॥

చ ర ణ ము లు.

కందిమల్లయపల్లె మావూరు - కాలకర్మాలు బాపును మావూరు ॥ఏవూరయ్యా॥ కనమలకటనుండుమావూరు - ఇట్లు కనవచ్చు కనరాదుమావూరు ॥ఏవూరయ్యా॥ ఇంటిలో పలపుట్టమావూరు - పాము-నంటి తెపలమిచ్చుమావూరు॥ ఏవూరయ్యా ॥ కర్మజీవులకెల్ల మావూరు - అంధ కారమై యుండునుమావూరు ॥ ఏవూరయ్యా ॥ కర్మము తెగి తేను మావూరు - పంతువెన్నెలైయుంతును మావూరు॥ ఏవూరయ్యా॥ రోగాలులేవయ్యా మావూరు - నిత్యభోగాలుగలి గుండు మావూరు ॥ఏవూరయ్యా ॥ జుంటితేనియపల్లె మావూరు - బహువింతలుగలిగుండుమావూరు॥ఏవూరయ్యా॥ కనికానకున్నదిమావూరు - ముక్తికారణమైయుండుమావూరు ॥ ఏవూరయ్యా ॥ పాతలనడుమను మావూరు బట్టబయలైయుండును మావూరు ॥ ఏవూరయ్యా ॥ శృంగారమైయుండుమావూరు - శ్రీరంగమ్మవసియించుమావూరు॥ ఏవూరయ్యా॥ తల్లిగోవిందమ్మమావూరు - తండ్రివీరబ్రహ్మం మావూరు ॥ఏవూరయ్యా॥

(౧౫.)—రాగము చేగడ - చాపుతాళము.

ప ల్ల వి.

చెప్పలేదంటనక పొవ్వేరు నరులారగురుని ।

అ ను ప ల్ల వి.

చేరి మొక్కితె బ్రతుకనేర్చేరు ॥ చెప్ప॥

చరణములు.

చెప్పలేదంటనక పోయేరు-తప్పదిదుగో గురునివాక్యము
తప్పుటో వలపోవువారల చప్పరించి ద్రిమ్మింగు శక్తులు ॥ చెప్ప॥
మొప్పెతనమున మోసపోయేరు - ఇదిగాక కొందరు గొ
ప్పతనమున గోసుమీరేరు - ఇప్పుడప్పుడనరాదు యెప్పు
డో యేవేళనో మరి- గుప్పుగుప్పని దాటిపోయెడు గుజ్జకటు
గులు యేరుపడును ॥చెప్ప॥ తాకుతప్పులు తలచకున్నారు -
తార్కాణమైతే యెక్కువతో దెలియనేర్తురు - జోక
తోడుత తల్లిపిల్లలు జోడుబాసి - అడవులందు, కాకిశోకము
జేసి ప్రజలు కాయగసరులునమలి చత్తురు ॥చెప్ప॥ కేకవేసి
ప్రాణమిడిచేరు రాకాసిమూకలు కాకబట్టి కలువరించేరు-
ఆకాశము యెఱ్ఱనౌను- ఆరుమతములు యొక్కటౌను- లోక
మందున జనులు- అందరు నీరు-అగ్నిలో మునిగిపోదురు ॥చె॥
అగలువిడిచి పొగలు దాటేరు - ఇదిగాక పట్టపగలుచు
క్కలుచూచి భ్రమసేరు - భుగులుభుగులు ధ్వనులు మింటను
పుట్టియేగిన పిమ్మటను - దిగులుపడుచు ప్రజలు చాల దిక్కు
లేని పక్షులౌదురు ॥చెప్ప॥ పాతకులు పదటగలిసేరు -
పుణ్యాత్ములైన - సాధకులు సంతసించేరు - భూమిమీద
ధూము ధాములు పుట్టిరేగిన పిమ్మటను - రామ రామ యు
నని వారలు రాలిపోదురు తెలుసుకొండి ॥ చెప్ప ॥ యే
మొ యేమో యెరుగకున్నారు - యెందెందు జూచిన యు
మునిపురికేనడువ మందూరు - భూతలమున యుట్టి వింతలు
పుట్టియణగిన పిమ్మటాను - నీతికృతయుగధర్మ మప్పుడు ని

ము నిలకడమీద తెలుసును ॥చెప్పి॥ ముందు వెనుకను గానకున్నారు - మూర్ఖులై భువిలో ముందుగతియు తెలుగ కున్నారు - కండువతో చిన్న పెద్దల కన్నుగానక గర్వము లచే - మందెమేళము లాడెవారిని బండు బందుగ గోతుర కృడ ॥ చెప్ప ॥ కీర్తు నైనను కూడదందుకు - ఒనకూడిన వృద్ధు - యేడజూచిన పాడుకొందురు - వేడుకతో పోతు లూరివీరభోగవసంతరాయులు - యేడుదీవులు యేకచక్ర ముయేలును బ్రంహ్మాండమంతయు ॥ చెప్పలేదంటనక॥

(౧౬.)—రాగము కల్యాణి - అటతాళము.

పల్లవి.

నేజూచినానే బ్రహ్మమునాలో నేజూచినానే ॥

అనుపల్లవి.

నేజూచినానన్ను నెలతరో తారక । రాజయో

గులుచూచే రమ్యమైన మూపు ॥ నేజూచి ॥

చరణములు.

కన్నులనడుమను సన్నబిలంబులో - ఉన్నతమైనట్టి పున్నమచంద్రుని ॥ నేజూచి ॥ చూపులలోపల పావలనడుమను - వ్యాపించి వెలిగేటి - అపరం జ్యోతిని ॥ నేజూచి॥ ఫాలభాగము నందు నీలజ్యోతుల సందు - వాలలాడుచు నున్న పరలింగ మూర్తిని ॥నేజూచి॥ చక్షురాగ్రమందు - అతుయవీధిలో - నిక్షేపముగ వెలిగె సాక్షిభూతమునాలో॥ నేజూచి॥ చందమామనడుమ కుందనాకృతియేమొ - ఆనందముగ వెలిగె - హరిహాతులూరివీరగురుని ॥నేజూచి॥

(౧౭.)—రాగము చక్రవాకము - ఏకతాళము.

పల్లవి.

ఈజన్మమికదుర్లభమురా - ఓరి

అనుపల్లవి.

సాజన్మసాకార సద్గురునిగనరా ॥ఈ॥

చరణములు.

పంచాక్షరీమంత్రంబుపఠనచేయరన్న - పఠనజేసితెయ ముడుపారిపోనన్న - పారిపోతె-అంబఫలమిచ్చునన్న ఫల మునందినవాడు పరమగురుడన్న ॥ ఈ ॥ మూడారువాకిళ్లు మూాయనలెనన్న - ముక్తివాకిటనిలచితలుపు తీయుమన్న తలుపుతీసితె - అంబతేజమిచ్చునన్న - తేజమందినవాడు తా గురుడోయన్న ॥ఈ॥ ఆరునదులమీాద- అంబవుందన్న-అం బలోదుర్గాంబ-ఆట్లాడునన్న - ఆట్లాటలోమంచి అర్థముం దన్న - అర్థమెఱిగినవాడు హరిగురుడన్న ॥ఈ॥ నాసికము లోదృష్టి నడిపించుమన్న - నడిపించిమఱినీవు నమ్మియుండు మన్న - నమ్మినవరత్నముల పీఠమెక్కరోరన్న - పీఠమె క్కితె - అంబపిలుచునోయన్న - పిలిచినంతటనీవు నిలుచుం డుమన్న - నిలిచినంతటివాడు నిజగురుడన్న ॥ఈ॥ ఇంటిలోపు లురెండు-అంటివుందన్న-అంటివుంటె మేనుమరచి యుట్టెనిలు వన్న- మేనుమరచిఘంట నాదమినుమన్న - నాదమినిపోతు లూరిని నమ్మియుండన్న ॥ఈజన్మమిక దుర్లభముగా॥

(౧౮.)—రాగము తోడి - ఆదితాళము.

పల్లవి.

పవిత్రకులము - ఓరినాదుకులంబని నడువరజాణా ॥ప॥

అ ను ప ల్ల వి.

ఏదిరాకులము మెఱుగక తిరిగేవు - నాదు
కులంబనినడువరజాణా ॥ఏదిరా॥

చ ర ణ ము లు.

నాధుబిందుసందునటియించురాకులము - భేదములెం చిల్లుభ్రమయనేలా - నాదుపుట్టినతావునాణ్యము తెలిసితే నాదమందుకులము నంటియున్నదిజాణా ॥ ఏదిరాకు ॥ స్త్రీపురుషులనే కులము సృష్టిలోపల రెండురూపులైయున్నవిరూఢిగాను - ఆపరబ్రహ్మము-ఆదివిష్ణుశివుడు స్త్రీపురుషులైనారు సృష్టిలోపలజాణా ॥ఏదిరాకులము॥ ఆదియైనకులముపాదు తెలియలేక వాదములాడేరువరుసతప్పి - మాధవ నామము మర్మము తెలియక నాదమే కులమని నమ్మరాజాణా॥ఏదిరా॥ సారమైనకులము-ఓంకారమై యుండు వీరగోవిందునికరుణతోను - కారణగురుదేవియీశ్వరికృపచేత - సారమైనకులము సాధించితివిజాణా ॥ఏదిరా॥

(౧౯.)—రాగము ఆనందభైరవి - చాపుతాళము.

ప ల్ల వి.

అందమైనపువులుగోతాము - ఆత్మారామునిపూజచేతామా

అ ను ప ల్ల వి.

కందర్పజనకుని యిందిరశ్రీదేవి - బిందుపీఠము
నందుపొందికైయున్నది॥అందమైనపువులు॥

చ ర ణ ము లు.

భావాభావమునందు జూతాము - భక్తజనుల సంతోష

ముచేతాము - భావమందుగురునిజలు తామభక్తితో - హరిపూజజేతాము ॥అంద॥ శ్రీగురుడితడనిగొలుతాము - మనచిత్తమందు పూజచేతాము - ఓమహీనందన నీమహిమదెలిసెను - సామజవరదుని సతికి పూజలుమనము ॥అంద॥ కమ్మని మధురము గ్రోలుచు - మనము నెమ్మతిగాపూలుగోయుచు - నెమ్మతిభావములిమ్మనిమదిలోన - సమ్మతిగాపూజనేర్పుతోనుమనము ॥ అంద ॥ అంగములోపల జూతామూ - భుజంగభూషణుని సేవచేతామూ - అంగము లోపలలింగముగనుగొని - అంగసంయోగము శృంగారముగామనము ॥అంద॥ మూడారువాకిళ్లు మూతామూ - మోక్షద్వారపు తలుపు దీతామూ - వేడుకతో పోతులూరుని వాసుని - ఇడాపింగళ నడుమవీరగోవిందుని ॥అంద॥ పట్టితిమమ్మమీపాదము - బట్టబయలైనబ్రహ్మపూజచేతాము - ఘట్టిగ శ్రీపోతులూరియీశ్వరిదేవినన్ను - చేపట్టిరక్షించు పరమపదరాణీ ॥అందమైనపువ్వులుగోతామూ - ఆత్మరా॥

(౨౦.)—రాగము భ్యాగ్ - రూపకతాళము.

పల్లవి.

ఎంతలెక్క తిరిగిననేమి లేదురా ॥

అనుపల్లవి.

చింతజేసిచూడకున్న వింతలేదురా ॥ఎంత॥

చరణములు.

ముక్కుదిక్కు మెక్కుబెట్టినిక్కిచూడరా - ఆ దిక్కుమూలమేమొ గాని దివ్యమాయరా ॥ఎంత॥ ముసుకులోన

మునుకు వేసిపాసగిచూడరా - ఆమునుకులోనె మునుకుదీసి ముక్తిచూడరా ॥ఎంత॥ ఆకసమున గాలివిరె నదిగోచూడరా - ఆ - గాలిమూలమే మోగానిమూలచూడరా ॥ఎంత॥ మూలమూలలుశోధించిముక్తిచూడరా - ఆ - మూలవున్న జ్యోతిని ముట్టించిచూడరా ॥ఎంత॥ చల్లగాలివిసరితె మొల్లలాయెరా- ఆ మొల్లలకాశించిన వాసనకొల్లలాయెరా ॥ ఎంత॥ ఎఱుపు నలుపు తెలుపులవియే మోచూడరా - పచ్చ పసుపంటినపద్మమాయెరా ॥ఎంత॥ సత్తుచిత్తుయొక్కటైతె శివునిపేరురా-ఆ-సత్తుపోతులూరిబ్రహ్మస్వామిపేరురా॥ఎ॥

(౨౧.)—రాగము ఎకులకుకాంభోజి - ఆదితాళము.

పల్లవి.

అహా బ్రంహ్మండమైనది ఆదిమంత్రము॥

అనుపల్లవి.

మనబ్రహ్మంగారు చెప్పినది పెద్దమంత్రము॥అహా॥

చరణములు.

ఔక్కముక్కలేనిపక్షి రేయింబగలుతపస్సుచేసి-ఒక్క చెఱువు చేపలన్ని యొక్కటేమ్రింగెను ॥అహా॥ ఇంటివెనుక తుట్టెపురుగు యింటిలోనందరినిమ్రింగె - చూడవచ్చిన జనులనెల్లచూచేమ్రింగెను ॥ అహా ॥ కాళ్లుచేతులులేనివాడు కడవముంత చేతబట్టి - నిండుబావినీళ్లన్నియొకడేముంచెను॥ అహా॥ పటిమీద స్వాతికొంగవేటలాడుచునుండాగ- చాటునున్న మీనువిల్లి- అట్లెమ్రింగెను ॥అహా॥ చెప్పినవాడువీరదాసుచోద్యముగాను-ఆత్మతత్వము - గొప్పవారుదీనిభావమువిప్పి చెప్పి తేనుచాలు ॥అహా॥బ్రహ్మండమైనది॥

(౨౨.)—రాగము నాదనామక్రియ - ఆదితాళము.

పల్లవి.

చెడుగుడాడెనే బ్రహ్మాంబలిగుడాడెనే॥

అనుపల్లవి.

చెడుగుడుగుడుయని గుమ్మనాదము కలసి
బిందుకళలను గూడుక ॥చెడు॥

చరణములు.

ముప్పది రెండక్షరములలో మేలైన నొకయక్షరంబులో నై గుబిగ్గైగుబిగ్గై గుబిగూయుచు - నాలుగుముఖముల నలుగురితరిమిపదిదిక్కులకుపరుగెత్తించి- చేట్టకొట్టగా పాలుకారగా ॥చెడు॥ ఛండతేజమైనిండుపౌర్ణమిపండువెన్నెలైప్రభలికాయగా - ఆకటమగుకయిూకటనలుగురు-నడుమనొక పినువృద్ధికడుసొంపుతో నిలిచి- సోహంసోహంసోహంబనిచెంగటబలుకుచు ॥చెడుగు॥ అర్గురుచెల్లిరి ఆటగెలిచెను - అయ్యజూచెను ఆనందించెను - వింతదెలిసినవీరపోతులూరు ॥చెడుగుడాడెనె బ్రహ్మాంబలిగుడాడెనె॥

(౨౩.)—రాగము ఆనందభైరవి - ఆదితాళము.

పల్లవి.

ఎక్కడివింతేన్నాశేమ్మా యెక్కడివింతే॥

అనుపల్లవి.

ఎక్కడివింతేవీరగురుడు వెతకిపట్టినన్ను దెచ్చి - మతములమంత్రార్థమెల్ల హితవుజేసిధారబోసె ॥ఎక్క॥

చరణములు.

పుట్టగిట్టకుండమేన భూతిబూసియూతీరున - పట్టులేని

సంసార భ్రాంతులన్ని విడువమనె ॥ఎక్క॥ కామక్రోధ లోభమోహా గర్వములను కడకుజిమ్మి - కారణమైనబీజ ములో కన్నుదెరచి చూడుమనె ॥ఎక్క॥ ఎక్కడివింతె వీరగురుడు వెతకిపట్టి నన్నుదెచ్చి - ముక్కుడెక్కు మెక్కు బెట్టి నిక్కిచూడుమనెనన్నా ॥ఎక్క॥ కుండలనగానాద మనగా అఖండమైన జ్యోతిజూపి - రెండుయిండ్ల నడుమ అజపకుండలి రేచించుమనె ॥ఎక్క॥ చర్మధర్మ మిధునమ నగా శేషికినే శేషిననగ - వాసియైనవీరగురుడు దాసిగా నుడమేలెనన్నా ॥ఎక్కడివింతేవ్రాశన్నా॥

(౨౮)—రాగం బ్యాగ్ - ఆదితాళము.

పల్లవి.

పోతుందన్నా - చెప్పక తేచిపోతుందన్నా॥

అనుపల్లవి.

పోతుందియీజీవి - బొందివిడిచిపెట్టి - ఖ్యాతి
గాను - ఆపో - జ్యోతిమలిపిజీవి ॥పో॥

చరణములు.

కోదండగురుజగ - దండబిరుదుప్రాని ఖండముడిగిబ్రహ్మాండమునిండగ ॥పోతు॥ కోపతాపములను - వేపునూన్పికను పాపలనడుమను - చూపునిలిపిజీవి ॥పోతు॥ ఆరుచక్రముల - మీరిసరోరుహా - జేరియోగసమాధి - జెంది జీవి ॥పోతు॥ అరమరలేకతా - మర్పణమును జేసి - శరణని శ్రీవీర - గురునికలియజీవి ॥పోతు॥

(౨౯.)—రాగము ముఖారి - చాపుతాళము.

పల్లవి.

అనుపల్లవి.

సద్గురునిగుఱుతకురమ్మనే - గురునిరమ్మనే ॥

చరణములు.

రమ్మనే మనవీరగురుని - ఇమ్మనే యుపదేశములు - కమ్మకొనికనుబొమలనడుమను - బొమ్మలాటాడించెగురుని॥ రమ్మనే॥ నాదుబిందుకళల చేత నాడుచుండ గాను నేను కూడికుండలి - నట్టనడుమ సూక్ష్మసుందరమైనగురుని॥రమ్మనే॥ ఆరుమతములనాగ్రహించి - ఆరుమూటిని త్రుంచివేసి ఆరుచక్రములకుపైన - ఆత్మరూపుడైనగురుని ॥రమ్మనే॥ వేడుకతో శివపోతులూరి - వీరభోగవసంతరాయలు యేడు దీవులుయేక రాజ్యముయేలుచుండే వీరగురుని ॥రమ్మనే॥

—(సిద్దప్పగారి కీర్తనలు.)—

(౨౬.)—రాగము మోహనం - ఆదితాళము.

పల్లవి.

జలజాక్షిరమ్మనె నే॥

అనుపల్లవి.

సద్గురుడు - ప్రసాదముకొమ్మనె నే॥

చరణములు.

కలికిరో యేమనుచు జెప్పుదు - కంటిలోపరి ముంటితుదపలె - వెలుగుసూక్ష్మపు జ్యోతిలోపల - విశ్వరూపము లెల్లజూపుచు ॥జలజాక్షి॥ ఆరువన్నెలుదెల్పె నే - నేత్రముల సదా నందగతినిల్పె నే - చారుతరముగ సాంఖ్యయోగము సరణినాకెఱిగించి ముప్పది- యారుతత్వంబులను గూడిన - యాత్మగనుమని బోధజేయుచు ॥జలజాక్షి॥ భవ

ములుదెగటార్చెనే తారకయోగ - భావమున నుగూర్చెనే-
పవన ధారణలక్ష్యముద్రా భ్యాసములు విడిపించి నిత్యము -
భువనములు చూచేటి యెఱుక నుబొందుమని యుపదేశ మొ
సగుచు ॥జలజాక్షి॥ భూతజాలము ద్రుంచెనే - దుర్గుణముల
మూలము పెకళించెనే- నాతిరో యాకర్ణింప వేయమ నస్క
యోగము నిద్రకై వడి-యేతలంపులు లేని జీవేశ్వరైక్యంబను
చుదయతో ॥జలజాక్షి॥ భయమావదలమనెనే- రేబగలువి
నఁబుముబొందమనెనే. బయలు నిర్భయులైన శంభుని - పట్టిజా
గ్రస్వప్న సుషుప్తుల - క్రియలఁ జెందక తుర్యపదమున కేళిస
లుపుచు వెలుగుమనుచును ॥జలజాక్షి॥ అంగము కాదనెనే
భామరో బ్రహ్మ లింగము నీవనెనే - సంగతంబుగ సిద్ధయోగీ
శ్వరుని వాక్యము నమ్మమనుచును - నిస్సంగివై సుఖమొందు
మని సంసారపాశము వీడఁ జేయుచు ॥జలజాక్షి॥

(౨౭.)—రాగము ఆనందభైరవి - ఆదితాళము.

పల్లవి.

చందమామ - చందమామ - చందమామ॥

అనుపల్లవి.

ఈసంధి తెలిపే జ్ఞాను లెవరే - చందమామా॥

చరణములు.

కాయమనే పుట్టిలోను చందమామా - పాము - మాయ
గానె మెలగుచుండు చందమామ ॥చందమామ॥ పవనకుంభ
కంబుతోను చందమామ-పాము ద్రుపహారి తిరిగి యుండునయ్య
చందమామ ॥చందమామ॥ జంటనాగస్వరములూది చం
దమామ పామును - అంటివాడిలేపవలెను ॥చందమామ॥

శోకబ్రాక్కితే నేపోము చందమామ - బళో్కపముతో తే
చునయ్యా చందమామ ॥చందమామ॥ రాకపోకరేకమై
తే చందమామ - పోము - లోకాలోకమేలునయ్యా చంద
మామ ॥చందమామ॥ తొప్పిమ్మనివాకిళ్లమూసి చందమామా-
పోమును - నెమ్మదిగాపట్టవలెను చందమామ ॥చందమా॥
భక్తియనేకట్టుగట్టి చందమామా - పామును - యుక్తిచే
సిపట్టవలెను చందమామ ॥చందమామ॥ దేహిదేహములసం
దు చందమామ - పాము - తెలియకుండా చుట్టుకున్నది॥
చందమామ॥ అజపమంత్రధ్యానముచేత చందమామ - పా
ము - అఖండకళలతో వెలుగుచుండు ॥చందమామ॥ పాము
నుబట్టే జోగీయెవరె చందమామ - ఓహో అతనిపేరే
సిద్ధగురుడు చందమామ ॥చందమామా॥

(౨౮.)—రాగం నాదనామక్రియ - అటతాళము.

పల్లవి.

తియ్యని మామిడిపండు - పండు।

అనుపల్లవి.

తినబోతేదొరకదుతిపులుమెండూ ॥తియ్యని॥

చరణములు.

పండుకు వృక్షము - ప్రజలెవ్వరెఱుగరు - పరమాత్మ
డనేయాకు పైనుండురా - పండుముఱుర్వై నాల్గు పర్వము
లైయుండు - పరమగురు ధ్యాన పరుల కేపండు ॥తియ్యని॥
విత్తులేనిపండు విశ్వములోనుండు - సత్యమయినామాట ని
త్యమయా - హా గతల్లికి అబిడ్డఘుగడైతే సత్యము యూ
మాట నిత్యముగనుడీ ॥తియ॥ కోములుకోవ పవులుతు

గూడిపిట్ట వీగుచునుండు మణిమంత్ర మనియేటి మహిమ తోడ- అల్లునకొడుకాయెతండ్రి పెనిమిటాయె-అమ్మకూతురు చెల్లె అనుభవమైయుండు ॥తియ్య॥ ఆకులుపువ్వులు ఆనందముగవిందె లోకములో కాయకాచియుండు - ఈ కాయములో కాయపాకము తెలిసితె - కళాలు చదివితేక లమాగుపండు ॥తియ్య॥ ఒరులకు యీపండు యొకదిను సుగానుండు - నరులాకుయీపండు నమ్మకుండు - ధరలో నయీపండు దాసులకైయుండు పరులకుయీపండుపంపు గాకుండు ॥తియ్య॥ జనులులోకభేదమున చపలమైపోయ్యేరు - జననమరణములేని జాతిపండు - వాలాయము గపండు-ఓంకారమైయుండు - మా తల్లిమహామ్మాయి మర్మమే పండు ॥తియ్య॥ ఆలుమగడురెండు ఆదిలేనినాడు కొడుకుమాతురు గన్నకొడుకేడిరా - అల్లుని తల్లియు హరిహరాదులకంటె- ముల్లోకములతోడ ముగ్గురుని మ్రింగె॥ తియ్య॥ రేయిపగలు లేకరవిచంద్రులును లేక - పంచభూతములు లేక ప్రతిభూతమై - పదునాల్గులోకములు యేలుచున్న- సిద్ధగురునియొద్దనేయుండు ॥తియ్యని॥

(౨౯.) — రాగము మోహన - అటతాళము.

పల్లవి.

ఏలయీ దేహాము పసికిరానిదెందుకీమోహాము ॥

అనుపల్లవి.

జాలమనెసంసార బంధములోనజిక్కి మూలమెఱుగని ॥

చరణములు.

పంచేంద్రియములను [illegible]

చంచలము ఛేదించితనలోనుంచి ప్రకృతి అంచితముగ మంచివాడై గురునిపంచను - పొంది కాచియుండనేరని ॥పల॥ వాడలోపలనుయేడింటినిజోడుగూడుకొని - ఆరుగూడుకమూడుదెలసి - జోడుగూడియేకముగను - కొటికపత్తులరెంటికదియబట్టి క్రమము తెలియని ॥ పల ॥ అష్టమదంబులనుమెల్లప్పుడు నిష్టదెలియకను- కష్టపడకను యిష్టమెఱిగితె కష్టలన్నియునష్టమగును - దృష్టిలోపలదివ్యనాత్మను నిష్టతో జూడంగనేరని ॥పల॥ మూటబెనగుచును ముమ్మూలము చోటుగానకను - మూడుమూడుఆఱుగడచి ముక్తిసతినిఅండజేరి - మోడివేసినకోడెపామును వేడుకతోనాడింపనేరని ॥ పల ॥ జ్ఞానమెఱుగకను మానాభిమానములోనబెనగుచును - కానరానికోనజొచ్చిసోనగూడిమేనుమఱచితానుతానై సిద్ధగురుని తలంచితన్మయమంద నేరని ॥పల॥

30.—రాగము కాపి - చాపుతాళము.

పల్లవి.

కులమెంచగానేల గుణమెకారణము ॥

అనుపల్లవి.

కులబిందుకులమాయ కుల మెక్కువేది ॥కుల॥

చరణములు.

యోనిలింగము రెండు యేకమైతలచగా-యోనిలోపిండమై వెడలినపుడే - యోనిప్రజాపతుల నెనసి పుట్టినకులము - ఘనమైనకులమేది కానికులమేది ॥కుల॥ శుక్లశోణితము చేలిప్తమైనాకులము - శక్తిసహితమైన శ్వేతకులము

[illegible]

జనులు మెచ్చవే కాదా ॥కుల॥ చక్కగా భ్రూమధ్య సరణిగనుగొనలేక - మెచ్చవని జెప్పుటది యేమికులము - ముచ్చటుదజూచిన మునులంతఋషులైరి - నిచ్చళంబెరిగితేమెచ్చవేకాదా ॥కుల॥ చావుపుట్టుక రెండు సమమని తెలియకను - తావుగోని యీవర్ణత్రయబద్ధులైరి - పగలు రాత్రులయందు - ప్రణవమేమారకను శివయోగమెరిగితే సిద్ధుడేకాదా ॥కుల॥ కశ్యపభరద్వాజగౌతమగార్గేయ శుకశౌనకాదిమునిసుతులెవ్వరో - వ్యాసవాల్మీకాదివశిష్ఠు మొదలుగ-వాసిగాసిద్ధగురుడీశుడేకాదా ॥ కులమెంచగా ॥

౩౧.—రాగము నాటనామక్రియ - చాపుతాళము.

పల్లవి.

మనసుమనమున బెనగి మనసు యేకము జేసి -
మనసు మర్మముగన్న దెయుకా ॥

అనుపల్లవి.

కనుచూపులకు నడుమ ఘననాసికము గాలి
కదసి రెండొకటైన దెయుకా॥

చరణములు.

అక్షరంబులకాది అక్షరము తాదెలిసి అక్షరముపఠియించు దెయుకా - అక్షరంబనుప్రణవమాలించివీనులను అనుదినమువినుటయే దెయుకా ॥మనసు॥ చీమయొక్కటికోటి సింహాముల దిగమ్రింగి శిఖరమందుండుటే దెయుకా- హేమవర్ణపుదోమయెనిమిదియేనుగుల వేగమున మ్రింగుటే దెయుకా ॥మనసు॥ వర్ణములనారింటివైపు దెలసితనలోను

నిర్గుణంబైయున్న దెటులకా - దుర్గుణంబులమూటి తొలగ ద్రోసి తనలోభర్గుడైప్రభగన్న దెటులకా ॥మనసు॥ కష్పయొక్కటి నైదుపాములను దిగమ్రింగి కాలుదువ్వచునున్న దెటులకా - గొప్ప మొసలిని చేపచప్పరించుక మ్రింగిచొప్పణగియున్నదే యెటులకా ॥మనసు॥ షట్చక్రములుగడచి నడిమివాకిలిచెరచి నాగేంద్రుడులేచినదెయెటులకా - ఇడపింగళలుగడచి యీజీవహంసతో కూడికుంభకమైనదెటులకా ॥మనసు॥ మేఘవృష్టులుతళుకు మేలైనఝడివాన యెడతెగకకురిసినదెయెటులకా - అరుదైనమాధుర్యమనుభవించుటసుఖము - అన్నిటినిమఱచినదెయెటులకా ॥మనసు॥ గంగయమునల నడుమ ఘనమైనమేడలో - అంగనతోగూడినదె యెటులకా - రంగైనరవికోటికాంతులకుకాంతియైన - ఘనసిద్ధ గురుజేరుటెటులకా ॥మనసు మనసునబెనగి॥

## ౩౨.—రాగం ధన్యాసి - ఆదితాళము.

### పల్లవి.

మర్గంబెట్టి నేసేటందుకు - మోక్షంబిదుగోవినరయ్యా॥

### అనుపల్లవి.

భర్గోదేవస్యాయని మర్గం-పదిలపఱచి తానేయవలెగా॥మ॥

### చరణములు.

ఆదికమలమున గణపతినెప్పుడు అర్చన పూజలునే యవలెగా - పదిలపఱచితా బహువిషయంబులు బంధించి ఆకుపెట్టవలెగా - వొద్దికతోవిషయంబులనే నూలు చెదరక అమనపోయవలెగా ॥ మర్గం॥ కామక్రోధలోభ మో

పాదులను కదలకుండకట్లుకట్టవలెఁ - నీమముదప్పక నీతి మార్గమున నమ్మతిగాపడుగెత్తవలెఁ - మమతలుబాసిమా యనురోసి మార్గమనేపడుగుచేయవలెఁ - యేమారకను యిరువైనైదిట యెంచిపడుగేరి మర్ధించవలెఁ ॥మగ్గం॥ పూనిగురువాక్యమను కుంచదీనుకొని పానుపుతో పడుగు నేయవలెఁ - అనకలఅష్టమదంబులనెప్పుడు అంటకుండ అంటెత్తవలెఁ - యెనసినపంచభూతముల పట్టియెనసిపడుగు యెంటవలెఁ - పనిబూనిగురుదృష్టిపదిలపరచి లెస్స భావంబనె అచ్చుతుకవలెఁ ॥మగ్గం॥ అలలుముళ్లులేని ఆత్మ వీధిలో అల్లువేసిమలబట్టవలెఁ - వెలసినభ్రూయుగ మ ధ్యంబునవదలక మగ్గముసాచవలెఁ - బలిమిగనాదంబని యెడుమోకునబంధించినేతజాచవలెఁ - తళుకుతళుకునిత్త ళుకున మెరసెడి తాటించి పలక తాటించవలెఁ ॥మగ్గం॥ నడినాళంబుననాడికొమ్మునన యముగకండెక్కించవలెఁ - కుడియెడమలతిరిగేపవనము గురుతుగదెలసినేత నేయవ లెఁ - నిండువేడుకతో పండువెన్నెలలో నిలిచి తమంతట యెరుగవలెఁ - దండిసిద్ధగురుఅండనుజేరి దారియెటిగిదిగ నేయవలెఁ ॥మగ్గం॥

—*(జ్ఞానబ్రహ్మానందయోగిగారికీర్తన)*—

33.—రాగము నాదనామక్రియ - చాపుతాళము.

పల్లవి.

జ్ఞానబ్రహ్మానందయోగి ॥

అనుపల్లవి.

జన్మకర్మము లెడబాపు - చిన్మయయోగి॥ జ్ఞాన॥

చరణములు.

చిత్తమనేపట్టణమందు - చిన్మయుడనె రాజు రాజ్యముచే యగాను-బుద్ధియనేమంత్రితోను - పురుషార్థమేమనితలపో యగాను ॥జ్ఞాన॥ ఒడలునీళ్లతడపనేమి - ఊపిరి బిగబట్టి యుండంగనేమి - జడలుధరింపంగనేమి-మాయాజాలముజే సితెజన్మపావనమా ॥జ్ఞాన॥ బూడిదెబూసితెనేమి-పూర్ధ్వ పుండ్రముబెట్టినపురుషార్థమేమి - మూడుగుణంబులుకా మి-తాముక్తుడుగాకున్న మునిసిద్ధుడౌనా ॥జ్ఞాన॥ ఆరుగు రునిపట్టవలెరా -పది-యారుగురినిబట్టిబంధించవలెరా - వే రొక్కటిని తెలియవలెరా - తా-వెలుగైన తెరచాటు తొని ల్వవలెరా ॥జ్ఞాన॥ తొమ్మిదితూటులబాన- అది-కల్మషము లకెల్లదాపైనగూన - నమ్మరాదురగురుడాన - యిది-నాశ నముజెందునునానావిధాలా ॥ జ్ఞాన॥ తొమ్మిదితూటులు మూసి వొంగలుంజేటిచోటెల్ల శోధించి తెలిసి - తామ్మొద నాదములెంచి - తాను - తుల్యమైనస్వానుభవమొందవ లెరా॥జ్ఞాన॥ సతిపతులిద్దరుగూడి చాల-రతిసేయగశుక్లశో ణితములుగూడి- సుతుడామెగర్భమువీడి-దాన-సుఖమేమి లేదురాపరికించిచూడ॥జ్ఞాన॥తల్లిదండ్రులుఅన్నలున్న -మరిత మ్ములుబావలుతగచుట్టుకొన్న-ఎల్లబంధులుగూడియున్న తా నుతర్లిపొయ్యేవేళతనకెవ్వరన్నా ॥జ్ఞాన॥ పరబ్రహ్మమేసత్య మౌరా-పరమానందరసమేపానముజేయవలెరా - గురుపా దమేశరవలెరా-దృఢమైనతత్వముతాదెలియవలెరా॥జ్ఞాన॥

—(వీరలింగగురువులవారి కీర్తన)—

౩౪.—రాగము ధన్యాసి - ఆదితాళము.

ప ల్ల వి.

ఎవరని యడిగితే సిగ్గౌతున్నది ॥

అ ను ప ల్ల వి.

ఏమని జెప్పుదు వినరయ్యా॥

చ ర ణ ము లు.

నేత్రకారుడై లోకములోకి- మూత్రపుగవినిదాటొస్తినయా ॥ఎవ॥ మొట్టమొదలుపుట్టివచ్చినవూరు - ఉచ్చగుంటలోనునికయ్యా - మొట్టుమైలనే యిరువుజేసుకొని యిష్టముగానేనుంటినయా ॥ఎవ॥ తల్లిదండ్రుల మదమునబుట్టిన తత్తరతనువని తెలియరయా- తానుయొల్లని మేహ్యాములోపల తాపొట్టలో నెపుట్టివస్తినయా ॥ఎ॥ శుక్లరక్తములు చుట్టుకొన్నవి యెవరనియడుగనేమున్నదయా - చీముపునులునుచ్చిష్టవు రోతలోచుట్టుచైక లోనుంటినయా ॥ఎవ॥ బూతుకుపుట్టినపీతిరిబుట్టిని సాతుకాయమేమున్నదయా - పిత్తుతేపుల దొత్తరిబొమ్మలో పెత్తనగాడై యుంటినయా॥ ఎ॥ తొమ్మిదికిటికిల మేడలోపలకర్మరహితమైయుంటినయా- తమ్మివీరలింగంబు సద్గురునినమ్మి సేవచేస్తుంటినయా ॥ఎవర॥

—(ఏగంటివారి కీర్తనలు)—

౩౫.—రాగం శహన - అటతాళము.

ప ల్ల వి.

ఇదిగో గంగాయాత్ర - యింటిలోనుంది ॥

అ ను ప ల్ల వి.

ఒంటి తెలిసినవారి కంటునీయాత్ర॥

చ ర ణ ము లు.

ఎఱుక మఱుపుల రెంటి నేకంబుగా జేసి ఊర్ధ్వస్వరంట నేఘవిలోననుండి పంచవింశతినదులుభాగీరథీగంగ పంచకోశములందు విశ్వనాధుడుండగనూ ॥ఇదిగో॥ నేత్రకమలమునందు కాలభైరవిదుర్గికా నీకురుక్షేత్రమేగ యాత్రప్రయాగా దానధర్మముయజ్ఞజపతపస్వాధ్యాయక్రతువులనుమించినది కమలమధ్యంబు॥ఇదిగో॥పదునాలుగుభువనములుపారుచుండె డిగంగకుండలీ మధ్యమునవిండియుండు- దండిగాతనలోనతథ్యమైయుండగా కొండనీళ్లకు నేల కోరేరునరులు ॥ఇదిగో॥ స్థూలదేహమెకాశి- సూక్ష్మదేహమెమణికర్ణికా కారణాదేహమేకావిడేతీర్థం సుజ్ఞానమనేబాట-సోహంరామేశ్వరంసేతులింగస్నానం - నేయుడభిషేకం ॥ఇదిగో॥ తిరిగిమళ్లనియాత్ర తెలుసుకోనేలేకుతెండిపోతులకెల్లతీర్థయాత్రలును స్థిరముగాయేగంటిగురుకృపగలిగితే- ఆశలుభువనంబులును తేజరిల్లగనూ ॥ఇదిగో॥

౩౮.—రాగము నాదనామక్రియ - అటతాళము.

ప ల్ల వి.

చేతులకందవు రెండు -శివ-నీతులుచెప్పంగవిందురటన్నా !

అ ను ప ల్ల వి.

చేతులకందవు రెండు- శివ -నీతులుచెప్పంగవిందురటన్నా

చ ర ణ ము లు.

ఊరిపడమటనొక్క- పాములేనిపుట్ట పుట్టలోనయూరవి

చ్చికట-ఉట్టిమీదనొక్కవూసరవెల్లియట- పట్టెడేసివెన్న మెక్కనటన్నా ॥చేతు॥ మొదలులేనిమ్రానుఆకులేనితీగ - తీగతీగకు అయిదుకొమ్మలటా - మొగ్గలేనిపిందె తొడిమ లేనిపండు- నోరులేనిబాలమ్రింగెనటన్నా ॥చేతు॥ గుజ్జుము మెనుబోతు కూడిచరించగనజ్జిడమీదనడచునటా - ఇ జ్జిపోతుజింకమజ్జి మ్రానుమీదనమలక యూబయల్ మేసు నటన్నా ॥చేతు॥ గుఱుతుగయేగంటి గురుకృపగలిగితే - గుఱుతుగనంజయ్యదెల్పునట శివునిభక్తులైతే - శివునిసన్ని ధికి- జేరుమని శివుడుచెప్పునటన్నా॥ చేతులకందవు రెండు॥

౩౭.—రాగం కాంభోది - ఏకతాళము.

పల్లవి.

కంటిమయ్యాకైవల్యము - కన్నులయందు॥

అనుపల్లవి.

వింటిమయ్యా-ప్రణవనాదమువీనులయందు ॥ కంటి ॥

చరణములు.

చూపులోచూడంగాను చిన్మయ రూపమున్నది - ఆ రూపులోన బ్రహ్మాండమంతవ్యాపించియున్నది - రేపుమా పు లేనివెలుగువెలుగుచున్నది - ఆ- పాపలందెపరమపదము బయలైయున్నది॥ కంటి॥ గుండ్లరెంటినడుమనక్కకూయు చున్నది- ఆ- గుండ్లుత్రిప్పిచూడపరమగోప్యమున్నది-గవిని కొద్దముసలిదిరొకతెకావలియున్నది - ఆగవినిగడచినను ముక్తికాంతయున్నది ॥ కంటి ॥ ఆకులేనిమ్రానుమీదకాకి యున్నది - ఆ - కాకి ముక్కులోన బంగారమున్నది -

బంగరంపుతీగమీాదకొంగయున్నది- ఆ- కొంగముక్కులో శివలింగమున్నది॥కంటి॥ నూాతిగట్టుతుదను మెక్కానాతియున్నది-ఆ-నాతినెత్తిమీాదపెద్దకోతియున్నది-కోతినాతిమీాద పరంజ్యోతియున్నది- ఆ-జ్యోతియందెయేగంటీశుడుస్థిరమై యున్నాడు ॥కంటిమయ్యాకై వల్యము॥

3౮.—రాగము అనంతభైరవి - ఏకతాళము.

పల్లవి.

సంధ్యవార్చేవిధము సందుతెలియిండీ ।

అనుపల్లవి.

సంధ్యతెలియనివాడు సద్బ్రాహ్మణుండగునా ॥సంధ్య॥

చరణములు.

సంధ్యనిస్సంధ్యలునుబొందిలోనెయుండు- బందెసంధ్యలుమానినైపై సంధ్యగనుడీ ॥సంధ్య॥ అదినీలతో యథమధ్యస్థాదిసుకళ-అదియవిద్యుల్లేఖ-అనగమరియూ ॥సంధ్య॥ అదియసీవారశూకాగ్రసూత్మంబనుట - విదితాపోజ్యోతి ఓంకారమామె ॥సంధ్య॥ ఓం యిత్యేకాక్షరంబనిచక్షులనడుమను జేరివినరాదా - చక్షువేమనను మనసేచక్షువు చంద్రమామనసో జాత ॥సంధ్య॥ చక్షుస్సూర్యో అజాయతేయని - అజనుతయేగంటిగురుకళనెరుగరాదా ॥సంధ్య॥

3౯.—రాగముఖమారి - అటతాళము.

పల్లవి.

గుట్టుదెలిసితెలుసుకొనరె - గుఱుతుగానుజాణలారా॥

అనుపల్లవి.

బట్టబయటనుండుదీని - భావమెల్లను ॥గుట్ట॥

చరణములు.

గండుపిల్లిలోకమెల్లా-గారవించియేలగాను - కొండయె లుకలొక్క రెండుకొలువుజేసేరా - అండబాయకచిలు కలైదుఅదిరిగాచుకుండగాను - పందుకోతులొక్క రొండు ప్రహారితిరిగేరా ‖ గుట్టు ‖ ముప్పుప్పుగొడ్డురాలి మూతి నొక్క కొడుకుబుట్టి - గొప్పకొండలేతు మ్రింగిగుటకపెట్టె రా - ఉప్పుచప్పుయనక నొకదువ్వురికిమింటికెగయగాను - క ప్పగంతులేసితోలికఅచిచంపెరా ‖గుట్టు‖ భువిసినోరులే నిమిడతవులిని మ్రింగెనమ్మదాని - వివరమెటిగియొక్కన క్కవికవికనవ్వేరా - అవిరళముగదెలిసి నాడ అలవికాదు యెవరికైన - తలపయేగంటిగురుడుతానెతెలుసూరా ‖గు‖

౪౦.—రాగముహిందుస్తాని - అదితాళము.

పల్లవి.

చదివినందుకు మోక్షసాధనంబేది !

అనుపల్లవి.

చదువకుండినజనులుసాధింపలేదా ‖చదివి‖

చరణములు.

సకలంబు బ్రహ్మమనిచాటంగశ్రుతులందు వాకచోటలే దనుచువకు వంగవలెనా - ప్రాకటముగప్రకృతి-విడిచినయ పుడె - అకలంకమైబ్రహ్మంబవుడెగనుబడును‖చదివి‖ గరిమ తోమతి హృదయకమల మధ్యమునందుపరిపూర్ణదనిశ్రు తులుబలుకుచుండగను - గరమర్థితో మాతృగర్భంబునం దుమరితల్లి నెరుగనిమాయతగులాటలాయె ‖చదివి‖ పర

మగురుడేకాంత భావజ్ఞుడైవెల్లు వరగ వదినాల్గులుజగజ్జాల
మునా - పరమగురుడేగంటికర్త నందీశ్వరుడు - కరుణజీవన
ముక్తిగలుగుటేగాక ॥చదివినందుకుమోక్షు॥

౪౧.—రాగము దేశికతోడి - రూపకతాళము.

పల్లవి.

కోరికోరిపరమగురుని కోరిచేరరే।

అనుపల్లవి.

కాలకర్మజన్మములను కడకుజిమ్మరే ॥కోరికోరి॥

చరణములు.

కాలిమడిమగుదమునందుకదలకుండనొత్తిపట్టి - మూల
బంధతత్వగతినిమురియుటెవ్వరే ॥కోరి॥ కంటిలోనయింటి
నడుమకంటిలోనుకన్నుదెలిసి - కంటిపాపనంటిపెనగుఘను
లెవ్వరే ॥కోరి॥ చూపులోనెచూపుదెలిసి చూపులో
నెరూపుచూచి-చూపులోన సుఖముపొందె శూరుడెవ్వ
రే ॥కోరి॥ నాదపంచకంబుతెలసినాదపంచకంబువిడిచి -
నాదలయముజెందినట్టినరుడెవ్వరే ॥కోరి॥ ప్రాణాపా
నవాయువులనుపరగనైవేద్యంబుచేసి - పూనికాయసిద్ధి
పొందెడుపుణ్యులెవ్వరే॥కోరి॥మాటలాడక అమృతమనెడు
మేటిబ్రహ్మరంధ్రమునను - మేటిహంసతోను గలిసిమెలగు
టెవ్వరే ॥కోరి॥ పరమగురుడేగంటిభవ్యలింగమూర్తి కరు
ణ- పరమలింగసుఖముజెందు ఘనుడెవ్వరే ॥కోరికోరి॥

౪౨.—రాగము సావేరి - అటతాళం.

పల్లవి.

సాగనైనకన్నుల చూపులుడుగకగాని।

టి - నిలుకడొక్కటిలేకనిప్పుడు - దక్కినట్టుగమాటలాడి - మీ - దయకుపాత్రులమన్నమాత్రమె ॥అ॥ తనువుధనము నుసంపదయుతానెనసియుండి గురునికొసగక - వెనుకవెను కనుగాచుకొని మరిదినదినంబునుసేవజేయక గుణములవి మూడణగిపోవునా - జీవేశ్వరులకు గుణములణిగిటితావు దెలుసునా- ఆవరణములనుతెనుచుకొని పైతేలనిచ్చునా- అరిషడ్వర్గములను- దుందునకలుగపడదన్నకుండునా - అన యముతదొక్కభీతంబగు- ఆత్మతత్వమాతెలుగజాలక- శునక ముగతనబుద్ధితిరుగగ మనను నిలుకడలేనివారికి ॥అ॥ కొం తెగురువులశిష్యవర్గమువెంటదగిలి బాధసేయుచు- తుంట మాటలునేర్చిసాధుల - గెంటుజేయుచురంటుకొని బల్ తంటతగువులబాధజేతురు - మీరెంత మీకంటెమేమెయె క్కవందూరు-గోవింద- అ॥- ముక్కంటి-మాపనివారలం దూరు - ఇటువంటివారలుయింటయింటనుయెత్తుకూళ్లదిం టు - తమమననువచ్చినట్టుగ కంటుకువాదంబు లుమగని కొంటెలకుదుర్మార్గజనులకు ॥అ॥ బుద్ధిచాలక సేయుబో ధిది - సిద్ధముగుశ్రీకంబగిరిని - శుద్ధమల్లనరహరిపై - బుద్ధినిల కడలేనివారికి॥ అడిగినప్పుడెచెప్పగూడునా॥

౪౫.—రాగము నాదనామక్రియ - చాపుతాళము.

పల్లవి.

రామభజన సేయరా - లమిడీకా ॥

అనుపల్లవి.

౧. [illegible] దగిడీకా॥రామ॥

చరణములు.

ధూముధాములేమి జేసునోము కొన్న ఫలమెకాని - తాముతాముతరలి పోయ్యేదారిగ్గానైతె తెలుసుకోర ॥రా॥ కండక్రొవ్వుచేత నిట్లు తిండిపోతులనుగూడి - ఉండబట్టక తిరుగబోతే గండమేలతప్పునయ్య ॥రా॥ తల్లిపిల్లయిల్లువాకిల్లెల్లమాయకల్లగాని - దొర్లదోసి యముడుచాల కర్లగొట్టిపోర్లసేసును ॥రా॥ టక్కుపిక్కు లాడిమెచ్చు కుక్కరీతి మొఱుగవద్దు - జక్కలేటికొండగిరినిచక్కనయ్యనట్టెమ్రొక్కు ॥రామభజనసేయర ఉమిడీకా॥

—(పూదోట బ్రహ్మంగారి కీర్తనలు.)—

౪౬.—రాగము సురట - ఏకతాళము.

పల్లవి.

అదిగోచూడవే మనస - ఆత్మలోముక్తి ॥

అనుపల్లవి.

కదిలముగసాధించు బ్రహ్మంబెతానగును ॥

చరణములు.

బ్రహ్మబ్రహ్మంబని భేదించికొలిచెదరు- బ్రహ్మబ్రహ్మము గాదుపరగంగవినుడి- బ్రహ్మబ్రహ్మంబైతె కుమ్మరాకారమున-బొమ్మలనుజేసుకొనితానమ్ముకొనునా ॥అ॥ విష్ణుబ్రహ్మంబని యిలయందుకొలిచెదరు- విష్ణుబ్రహ్మముగాదు విశ్వంబులోను- విష్ణుబ్రహ్మంబయితె కృష్ణావతారమున - విటకతైలనుగూడి తాకష్టపడునా ॥అ॥ శివుడుబ్రహ్మంబని సృష్టిలోగొలిచెదరు-శివుడుబ్రహ్మముగాదుసిద్ధంబుగాను-శివుడు

బ్రహ్మాండమై తేశిరము చేధరియించి- కాటిలోపలశివుతుకలియ దిరిగిపోనా ॥అ॥ ఆరుమాటిని దాటి మేరుశిఖరముమీాద - ధీరముగవెలిగేటిధీవరేణ్య - పదిలముగపూదోట ప్రభువు నాటినయపుడె - ఘనమైనమోహాబ్ధికడనీదబడును ॥అదిగో॥

४२.—రాగము కాపి - చాపుతాళము.

పల్లవి.

అదిరాము క్తికిత్రోవ - ఇదిరాసాధించు ।

అనుపల్లవి.

పదరాయీాబూటకంబోవ్వదురాన్నామది ॥అ॥

చరణములు.

వదలాకగురుకొల్వవలెరా నెరనమ్మి-పదపడిలో చూపు చెదరనియ్యకురా ॥అ॥ బొమ్మరింటిలోమంచిసామ్ము ఉన్న దిరా-ఆసామ్ముదక్కించుకొనెకసూటియున్నదిరా॥అ॥ఆరు వాకిళ్లుమూసి అందురొదవినుచు - పరులుకూడినచోటయే కాంతమునను ॥అ॥ ధీరతనమున సన్నదిడ్డిదూరెదవు - కా రుచీకటిలోన కదలకటునిలచి ॥అ॥ పాలుపొంద గురుబోధ ఘూత్రియెగజల్లి తెలివిచే చీకటిగూట దివ్వెముట్టించి ॥అ॥ తెలతెలతెల్లవారె భానుడుదయించె- అలపట్టపగునైచుక్క లుగనుపించె ॥అ॥ చెలరేగికళలతో చంద్రుడుదయించె-అల వీరపూదోట రామన్నయితడు ॥అదిరా॥

—(విడెప్పదాసువారి కీర్తనలు)—

४३.—రాగము సావేరి - ఆదితాళము.

పల్లవి.

చెడుగుడాడెనె - మారంగయ్యే చెడుగుడాడెనె ।

అ ను ప ల్ల వి.

చెడుగుడాడెన - మారంగయ్య చెడుగుడాడెన ॥ చెడు ॥

చ ర ణ ము లు.

చెడుగుడుగుడుయని- పలికెటినడుమను నాడినవిడిబడి- ఆడాడను పదేడులోకములు యెడలేకెప్పుడు - వాడవాడలోవడిగలవాడై - ముడివిడిచిమాడెట్రిమింగి ॥చెడు॥ నాటకవీథిలో నేటుగనెనరుగ - ఆటలాడుచును అటుయిటుఆవల- వటవృక్షముపై వటపాత్రుండై- ధిటుడైజీవిలోదివ్యవిరాజై- నటనమార్గమున నాటకధారియై- చాటుచుచతురాక్షరిన్మింగి ॥చె॥ రంగరంగవైభోగరంగమున రాధాంగుండై- బంగనబయలుగ- చెడుగుడుగుడుయనిజంఘులుచాచుచు - రంగుగపంచాక్షరిన్మింగి ॥చె॥ అంతింతకునొకఅంతస్థానమున- కాంతికాంతికేకాంతంబోకనై - కుంతలములలో కుంటెనకాడై- అంటియింద్రియాసంధానుండై - అంటిఅంటకను ఆత్మలోనతడై - సందుప.డాక్షరి నంగిట మ్రింగి ॥చె॥ సత్తుచిత్తుసదానందండై - సకలాత్మలలోసర్వముతానై - సర్వశేషియైసర్వేశ్వరుడై-సిద్ధులలోపలచిదానందుడై- శాశ్వతముగ శతకోటివిలాసుడై- సతతముసత్యమైశక్తిసహితుడై - అష్టాక్షరి నంతలోనమ్రింగి ॥చె॥ దశనాదంబుల దశవీధుల దేవేంద్రులోకమున దేహాము లిమిడియు-దాసదాసదాసానదాసులకు- దాసుడైనవిడెప్పదాసునికి ద్వయమునాంచారుదేవి యిలద్వయకృష్ణసానితో ద్వైతుండై - దేశదేశదేశాధీశుడు హరితానుతానెతత్వము తత్వము - యెతిపతియేశాక్షరిన్మ్రింగి ॥చెడగు॥

—*(చిత్తూరునరసింహ దాసుగారి కీర్తన.)*—

౪౯.—రాగము హిందుస్తాని కాపి - ఆదితాళము.

పల్లవి.

ఎక్కడజూచిన బ్రహ్మమయంబని చక్కగ నెఱుగును-సుజ్ఞాని॥

అనుపల్లవి.

అక్కరబడి వేమన్నగురు జేరక-తక్కి మెఱుగును-అజ్ఞాని॥

చరణములు.

వాదభేదములు- అణచి సద్గురు - పాదము జేరును- సుజ్ఞాని। మీదనున్న ఘనచే తెఱుగక రస - వాదము గోరును-అజ్ఞాని ॥ఎక్కడ॥ జ్యోతిని రామయభ్రూమధ్యంబున - ఖ్యాతిగ గాంచును-సుజ్ఞాని। కోతివలె నేవెఱ్ఱిచూపులు చూచుచు నీతిని మానును-అజ్ఞాని ॥ఎక్కడ॥ రాక్షసభూజనకూటమునంటక-మోక్షము జెందును-సుజ్ఞాని। దీక్షలు బొందియు పేక్షవిడువకయు-శిక్షల నొందును-అజ్ఞాని ॥ఎక్కడ॥ దూషణభూషణ దేహంబును కొని- రోషము ద్రుంచును-సుజ్ఞాని। వేషధారుడై మానక రాగ-ద్వేషమునుంచును-అజ్ఞాని॥ ఎక్కడ॥ చిలుకవలెను చిత్తూరిశివునితో- పలికినవాడే- సుజ్ఞాని। పలుమరు వరకవి నరసింహదాసుని తలువనివాడే-అజ్ఞాని॥ ఎక్కడబూచిన బ్రహ్మమయంబని- చక్కగ నెఱుగును సు॥

౫౦.—రాగము ధన్యాసి - ఆదితాళము.

పల్లవి.

మాయను వరికే మర్మము ఉన్నది
న్యాయముచినవే ఓమనసా।

అనుపల్లవి.

కాయములోపల-ఉపాయముకనుగొని
మేయవలెగా పరమే-ఓమనసా ॥మా॥

చరణములు.

అండపిండ బ్రహ్మాండములన్నియు కుండలియనవేన్రా మనసా - దండిభావమిది దారిజూపితినిముండమోపివలెనుండకేమనసా ॥మా॥ చెట్టుయెక్కుటకుగుట్టుదెల్పెదను పట్టుపట్టవేన్రామనసా - పట్టువదలకను బ్రహ్మామునీలో ముట్టివిదువవలెన్రామనసా ॥మా॥ తంటలమారినైన కంటిచూపులో అంటిమాడవలెన్రామనసా - కొంతెపెతనము ఆరింటవిడిచిగురినంటి చూడవేన్రామనసా ॥మా॥ తిరుపతివేంకటరమణుడెగురుడని యెఱుకగఁజువకేన్రామనసా- ధరణిలో నరసింహదాసుని వాక్యము-పరమనివినవేన్రామనసా ॥మా॥

౫౧.—రాగము మధ్యమావతి - ఝాంపుతాళము.

పల్లవి.

నాదంబతి జాగ్రతగా విను మనసా -
సాక్షాత్ సద్గురు ప్రణవ నాదం ।

అనుపల్లవి.

నాదంసద్గురుబోధం సంశ్రుతివేదం అక్షరభేదం ।
దశవిధనాదం బతిజాగ్రతగా వినుమనసా ।

చరణములు.

ఇరుగిరులకుపైగానెక్కి - వినుమిక్కిలిగాగురుని కీలకమునదక్కి - యిరుగిరులకును ఇష్టదైవమును చిలుకగునగు

చుచు- చిత్తవృథంబున పురమును వెడలిపరమునుజేరి- సరి గరిగరిగరిసప్సోహంబనుచును ॥నా॥ కంటిపాపనుకట్టివేసి - కర్మములను జంటబాయకకట్టికోసి - కంటిపాపనుకిలనుగ పెంచి-మంటిబొమ్మనుమిణుకుగదిద్ది - గుంటనక్కను కూ యకగట్టి-ఘంటానాదముఘుణఘుణవూచుచు॥నా॥పట్టువిడు వకపట్టుబట్టి వక్యముతోడను పిట్టనుబట్టిబిగియకట్టి - పట్టు విడువక - పరమహంసనుత్రిట్టుత్రిట్టక - త్రియ్యనిఫలములుచె ట్టుపైగనుచేరిచరింపుచు- దిట్టముగా యిలధింధింయనగా ॥ నా॥ ధరనుఘటికాద్రియందునిలచి - యున్నమహాత్మునైన హారినిమదినిదలచి-ధరలోధగధగ మెఱయుచుము క్తిని - సు రలుమెచ్చ యీనరలోకంబున - చెఱుకుపాలుచెల్ చెల్ మనగను- నరసింహదాసునిచేరిభజించి॥నాదంబతి॥

౫౨.—రాగం నాదనామక్రియ - ఏకతాళము.

పల్లవి.

హరిఓం హరిఓం అనరా - ఆదిబ్రహ్మమేగనరా ।

అనుపల్లవి.

హరిఓం - హరిఓం అవిఘ్నమస్తు శివాయ

గురు ఓంహరిహరి హరియనరా ॥హ॥

చరణములు.

అంతర్యామునగనరా - అది- అయిదక్షరములు అన రా - అంతర్యామునఅబ్బితే బ్రహ్మము అద్యంతమైజ్యోతి రూపమై - రూపమందున సూక్ష్మము వెలుగై నాదబిందులై నాలుగుయోనులై - ఒకటై, రెండై, మూడై, నాలుగై, అయిదై, ఆరై, ఆరింటిలో ఆడుచుపాడుచు- ఆత్మరూపుని

అందముగనుగొని ॥ హరిఓం ॥ శంఖుచక్రములు గనరా అష్టాంగయోగములువినరా - శంఖచక్రమున శాస్త్రములారై- ఆరింటిలోఆకాశంబై అష్టభుజంబుల సృష్టికర్తయై త్రిలోకమందున దేవతులైనై - అయిదు అయిదు యిరువై అయిదింటిలో- అకారఉకారములురెంటినివిడిచి - మకారమందునయెక్కజూచుకొని- ఓంకారంబునయొకటిగానిలిచి॥ హరిఓం॥ అకారబంధమువినరా ఓంకారబీజముగనరా- అకారఉకారముల రెంటినివిడిచి - అయిదక్షరములు హరినారాయణయని అంగములోకల లింగముకనుగొని - లింగమందునిలచి యుండినగురు నిత్యముసత్యముసిజమనినమ్మి- సద్గుణంబున సత్యవంతుడై సర్వమందున చిన్నిరూపమై చిన్నిరూపమునజేరిశివాయని ॥హరిఓం॥ దండిగురువులను గనరా సామాన్యముకఠినంబిదిరా- దండిగగురుజేనిండుతేజమని - కుండలివాకిలి కోటదాటిహరి - అరుదళంబులు అష్టాక్షరిదై - అక్షరమందున అఖండరూపమై రూపనామములురెండునువిడిచి సుందరనాభునిసూక్ష్మముగనుగొని - సూక్ష్మమందున చూపునిలిపి-కంటిబొమ్మను కలసిచూచుకొని గురువేమన్నను మదినినిలుపుకొని - నరసింహదాసుని నమ్మినిలచినీవు ॥హరిఓం హరిఓం॥

౫౩.—రాగము నాదనామక్రియ - ఏకతాళము.

పల్లవి.

కుక్కనుబట్టగవలెరా జీవా-కుక్కనుబట్టగవలెరా।

అనుపల్లవి.

కుక్కనుబట్టె పక్కవమున్నది ముక్కులుగట్టర ఓరన్నా

చ ర ణ ము లు.

కొక్కరకోయనికోడికూసెను - అక్కరబడితాసి దన్నా ॥కుక్క॥ కొండముచ్చువలెకొంతసేపుతానిండియుం డునురోరన్నా - నిండియున్నదని యెడబాసియుండిన కొండ లెక్కిదిగునోరన్నా ॥కుక్క॥ పట్టువిడిచిన పెద్దలకెల్లనుపట్టు సాధనవోరన్నా - ఘట్టిగనమ్మిమఘటమునపొర్లుచుపొట్ట పేగులో-త్రోతన్నా ॥కుక్క॥ అంతర్మధ్యాకాశమందునవం తములాడుర- ఓరన్నా - ఇంతఅంతలకుచూడను శక్యము యెంతమాత్ర మిదికాదన్నా ॥ కుక్క ॥ తిరుపతివరగిరి తేజ రూపునితరిమిపట్టరా-ఓరన్నా ధరణిలోనరసింహదాసుని శరణనిగురుసెరుగగా- ఓరన్నా॥ కుక్కనుబట్టగవలెరా॥

౫౮.—రాగము ధన్యాసి - చాపుతాళము.

ప ల్ల వి.

కామమునుమరచే నీమముయున్నది -
రామనామరామయను-ఓమనసా।

అ ను ప ల్ల వి.

ప్రేమతో సద్గురు వేమనచిన్మయ నామమునమ్మవే-ఓమనసా॥

చ ర ణ ము లు.

నీవు నేను అనుభవానుభవనార్థముల తావు తెలియవే - ఓ మనసా। దేవుడైనపరమాత్మునిరంజన దేవు నెఱుగవే- ఓమన సా ॥కామము॥ ధనధాన్యంబులదలచగ నేటికి ఘనముకాదె తీవిడుమనసా । మానక ఆత్మధ్యానమె మనకుమూలమైయు ది-ఓమనసా॥ కామము॥ గురునికూడినచానాదుల దినుసు ... ... వే - ఓమనసా । తరుచుగనీవును తన్మయ

మందుచు వెలుపకనిలువవే- ఓమనసా ॥కామ॥ ధరణిలో
చిత్తూరిపురమునకరిగిరి- వరదునికోరవే- ఓమనసా ॥కామ॥

౫౫.—రాగము ముఖారి - ఏకతాళము.

పల్లవి.

జీవమా - మాయాజీవమా ॥

అనుపల్లవి.

జీవమా - మాయా జీవమా ॥

చరణములు.

జీవమా నీకెంతచెల్పినదోవ తెలిసినదువవేమి - కావర ముఅణచి సద్గురు భావమందునిలువవేమి ॥జీవ॥ ఆశలనేఅహాముపిడిచియాశతో శ్రీరామభజన - నాసికావనముచేరి దాశరథేమనవెహీన ॥జీవ॥ నీతిమార్గులనువెతకి నీయవస్థలన్నిపిడిచి - వ్రాతఫలముతెలునుకొని వాక్కుమూసిధ్యానమాడవె ॥జీవ॥ ధరణిపైశ్రీనరహరియనిమాపు రేపుమొక్కటిగ - నాదబిందుకళలయందు నాట్యముద్రోక్కంగరాద॥ జీవ॥ తిరుపతిమాంపాహి వేంకటగురుని నీలోగోప్యముగను ధరణిలోనరసింహ్మదాసుని- పరమచిత్తర్ధ్యమునుజేసి ॥జీవ॥

(నరనారాయణ దాసులువారి కీర్తన.)

౫౬.—రాగము దేశితోడి - రూపకతాళము.

పల్లవి.

బ్రహ్మజ్ఞాని గుఱుతు లీరీతుందు ।

అనుపల్లవి.

జ్ఞానఖడ్గముచేత నజ్ఞానముఛేదించి - మానసమునపండి-
మమతలీడిన బ్రహ్మజ్ఞానిగురుతు లీరీతుందు ॥

చ ర ణ ము లు.

మదమత్సరములనుమాయపరచియు-నిష్ఠ। చెదరకమనను నిల్వగట్టేరురా।దృష్టి-చెదరకచిత్కళలంటేరురా। అంటి-ముదురువెన్నెలబయలుగనియేరురా। పూని-యెదురులేకనులయమయ్యేరురా- నిదురజెందినగతి నిలచినయోగికి - గదలెత్తెప్పలపాటు వదిలుండురా ॥బ్రహ్మ॥ అశాపాశము లేని యనుభవజ్ఞానికి। మోసబుద్ధులువానిజేరవురా।జంట- శ్వాసముల శబ్దమణగుండురా। దాని - వాసమేగురు స్థలమని యుండురా। దేహ - వాసనవిడిథరనుదిరిగేరురా। కాసుల మీద నిరాశజేయుచు। పర-మేశానందముబొందియెఱుకై యుండిన ॥బ్రహ్మ॥ బాలోన్మత్తపిశాచగుణములతో। లీలజేయుచుధరనుదిరిగేరురా। వానికి - కాలునిభయమెందు లేకుండురా। చిన్న - నీలతోయదమధ్యనిలచేరురా। అందు - వాలలాడుచు ముక్తిగోరేరురా। గాలిమనసుదృష్టికదలకుండినవాని। కేలోకమునభయమేముందిరా ॥బ్రహ్మ॥ సాధుసంగముచేసిభేదవాదముమరచి।నీదినాదనుసొంతంలేకుండురా। వానిపాదాలపై కాయల్గాచుంతురా- దేహం - నాదికాదని మఱచితిరిగేరురా। యెంతో-బాధలైననుసంతోషించేరురా। బోధవేదాంతసిద్ధాంతమతములనే। వాదులసాంగత్యం విడిచేరురా ॥బ్రహ్మ॥ ధరనుసద్గురువులతరచిచూచితేవారి పరిపూర్ణయనుభవమిట్లుండురా। శ్రీవ - యెఱిగినవాడెగుర్తెఱుగునురా। లోక- నరులకుయిదియుంథకారమురా। నిజ- వరయోగినడిచె శ్రీవరయిదియేనురా।వరనారాయణ దాసు వివరమిట్లుండగ గుఱిలేనిగురుసంఘముగానేరారు ॥బ్రహ్మ॥

—*(నారాయణ గురువులవారి కీర్తనలు.)*—

౫౭.—రాగము. వరాళి - ఆదితాళము.

పల్లవి.

మాయను నఱికినవాడు గురురాయనితో జతగూడు॥

అనుపల్లవి.

పాయుచు విషయము రోయుచు సతతము
యేయెడచూచిన యేకము తానై ॥ మా॥

చరణములు.

కుండలినటు భేదించి యఖండము గనుభావించి - అండపిం
డ బ్రహ్మాండములంతట నిండి పండి యానిర్వికల్పమున॥ మా॥
మూఁడువాకిళ్లుమూసి మూలకవాటముదీసి - ఇడ పింగ
ళజోడుగూడుకొని మూడుగడచి - ఆమూలము తానై ॥మా॥
ఆధారమున రేచించి మణిపూరకమున కుంభించి - కోరిన కోర్కె
లన్నియు నివారణ జేసెను నారాయణ గురు పారాయణ చే॥
మాయను నరికినవాడు॥

౫౮.—రాగము. నాదనామక్రియ - ఏకతాళము.

పల్లవి.

ఆనందమయముగావలెను॥

అనుపల్లవి.

పూని తాను తానై యున్న - తావు గనవలెను ॥ ఆనం ॥

చరణములు.

కామములకడ కొ్త్తవలెను అష్టపాశజంబుల మడను
నమయింపవలెను॥ ఆన॥ ప్రేమసద్గురు జేరవలెను దుష్ట తా
మసపు దుర్గుణము తొలగింపవలెను ॥ ఆనం॥ సత్య మిమ్మదిని

ల్పవలెను-అసత్యదేహముమీఁదఆశవిడువవలెను-భక్తిమ దిలోనిల్పవలెను జీవన్ముక్తిమార్గముతాను ముందెఱుఁగవ లెను॥ ఆనం॥ అక్షరాత్మకుడుకావలెను మూఁడక్షరంబుల భావమదితెలియవలెను - దీక్షాధికారికావలెను-మోక్ష కాంక్షచేతనుసద్గురుజేరవలెను॥ ఆనం॥ నిద్రరాకడదెలియ వలెను దానిభద్రపఱచుక యోగనిద్రబోవలెను- చిద్రూ పమిపుడెరకవలెనుఖేచరీముద్రకీలెఱిఁగిసద్గతిబొందవలెను॥ ఆనం॥ వేషభాషలుమానవలెను తన్నుదూషించువారిని భూషింపవలెను-కాషాయధరుఁడుకావలెను నాదఘోషవీ నులయందుఘోషింపవలెను॥ ఆనం॥ చూపుమనసొకటిగ జేయవలెను-సర్వ- వ్యాపకుండై చిన్మయాత్మగనవలెను మేడమీఁదికిజేరవలెను-అచట-జోడుబాయక హంసజూడ గనవలెను॥ ఆనందమయుఁడుగావలెను॥

౫౯.—రాగము. సావేరి - అటతాళము.

పల్లవి.

అన్నమేబ్రహ్మమురా జీవునకాధారంబనరా॥

అనుపల్లవి

అన్నముబ్రహ్మము ఆదిస్వరూపై
ఎన్నరానిపరమేకముతానై ॥ అన్న ॥

చరణములు.

ఆదిఅనాదియురా అన్నము ఆపోజ్యోతియురా - ఆది బిందువునై అమనస్కంబై ఆదిమధ్యమునఅంతరాత్మయై॥ అన్న॥ మూఁడుగుణంబులురా అన్నము నాదమునతోగన

శా-మూడుమూలమైము క్తిపదంబై మూటికినిల్కడమూలముతానై ॥ అన్న ॥ చతుర్వర్ణముర్రా అన్నము శ్వేతద్వీపముర్రా - శాంతరూపమైశివమైపరమై చతుర్వక్త్రుడై చతురాక్షరియై ॥ అన్న ॥ నాదముగనబడుర్రా నారాయణగుణుడుర్రా - ఆదిమూర్తియైఅఖిలాండంబై ఆధారంబున అక్షరరూపము ॥ అన్నమే బ్రహ్మముర్రా ॥

౬౦—రాగము. మధ్యమావతి - ఏకతాళము.

పల్లవి.

అంతాచిన్మయ అఖండమువ్యాపం ఆనందో బ్రహ్మానందం॥

అనుపల్లవి.

వింతగాదు అనుభవమంతయు దెలసి
యంతరాత్మను చింతసేయవే॥అంతా॥

చరణములు.

స్థూలసూక్ష్మములుతానై సుకరంబై సురసేవ్యంబై ఫాలభాగమునబహుసౌఖ్యంబై పావనమై ప్రత్యక్షంబై మూలబ్రహ్మమైము క్తిపదంబై మూటిమూటిమూడావలతానై - కాలాకాలంబై కళాతీతమైకళలుమించిచిత్కళలువెలుంగుచు ॥అంతా॥ పంచబ్రహ్మమైపంచాక్షరమైపంచభూతమైప్రణవంబై పంచపంచయిరువైయైదులుతానై పంచవాక్యములు - పంచశూన్యములు అంచితముగఅభిమానముతానై ॥అంతా॥ రక్తశ్వేతనిరాకారంబైసవ్యంబై ధూమాకృతియై ముక్తికిమూలమునమూర్తిత్రయముగ - ముదమునజూచెటివంగ్గురిలో- శక్తిసహితమైశివమైపరమై

శాంతంబై సద్భావంబై వ్యక్తంబై - వేదాంతసారమై - వె
లుగులోపల వెలుగు మనుచున్నది ॥అంతా॥ పటికియారకభ్ర
మయుచుండుదుసు - ఎరుగరాతమలోనుండగను నాటకధా
రుడునారాయణుడై - కోటిసూర్యలకాంతులతో వెలుగు
చు ॥ అంతాచిన్మయమఖండ ॥

౬౧.—రాగము ధన్యాసి - ఆదితాళము.

పల్లవి.

మోసపోకమాయాపాశలు - మొదటనేకోసివేయవలెరా ॥

అనుపల్లవి.

దేశములోపరదేశికుడుండే - వానిదెలియవలెరా ॥మో॥

చరణములు.

శేషశాయిపాదారవిందములు సేవింపగవలెరా-మూ
సినముత్యమువలె నేమురియుచుండవలెరా- భక్తితోడతన
భావములో-నిజభక్తుడుగావలెరా-శక్తిమాయలకుచిక్క
కదృఢచిత్తుడుగావలెరా॥మో॥పిండాండంబున బ్రహ్మాండం
బును పెనగిచూడవలెరా-ఉండెడితారకమండలమందున
ధ్యానునికిసేయవలెరా - నిండియేకమైయుండినతనమది నీ
ఠుసేయవలెరా - పండువెన్నెలై ప్రభలెటితేజం- బయలు
జూడవలెరా ॥మో॥ గాఢాంధంబున రేయుంబగలును-క
లసిచూడవలెరా - నాడెవాడై యుండినఘన నిజవాసునె
రుగవలెరా-ఉన్యక్షుడై విషయేంద్రియంబుల ఊరకుండ
వలెరా - నిద్రహారముడిడిదిక్షేదరిమ్ముద్ర తెలియవలెరా ॥
మో॥ నిద్రలోపునభద్రమైనముద్ర దెలియవలెరా-చిద్రూ

షంబునగలిగెడిజీవుని సత్తుదెలియవలెరా-ఉశ్వాసనిశ్వా
సంబులువిడిచే-ఉపము తెలియవలెరా-బున్సునవినశే అను
రగాలిలో-భేరివినగవలెరా ॥మోస॥

౩౩.—రాగము నాదనామక్రియ - చాపుతాళము.

పల్లవి.

సత్తుచిదానందయోగి॥

అనుపల్లవి.

చిత్తలతాబద్ధచిన్మయయోగి ॥సత్తు॥

చరణములు.

చిత్తమనేపట్నమందు చిన్మయుడనేరాజు రాజ్యము
చేయగాను-బుద్ధియనేమంత్రితోను-యిట్టి- పురుషార్థము
నుతలపోయవలెను ॥స॥ భూతిపూసితెనేమి-యిట్లు, పూ
ర్ధ్వపుండ్రము బెట్టినపురుషార్థమేమి - మూడుగుణంబుల
కామి-యిట్ల, మూర్ఖుడనై తెనుమునిసిద్ధుడౌనా ॥స॥ ఒడ
లుపేళ్లదమపనేమియిట్లు-వ్రేడలుకేళ్లదడిపినూపిరిబిగబట్టనే
మి-జడలుధరించితెనేమి-యిట్లు-జడలుధరించితెజన్మపావ
నమా ॥స॥ భూమిలోపలనొక్క చెట్టు-అది-పుట్టినప్పటినుం
డిభోగాలపట్టు - కామక్రోధంబునబుట్టు-అది, కాంక్షింప
భవరోగములకాటపట్టు॥స॥ తొమ్మిదితూటులబాన-అవి-
కల్మషంబులకెల్లకాపైనగూనా - నమ్మరాదురగురుడాన-
అది, నాశంబుజెందునునానావిధానా ॥స॥ సతిపతులిద్దరు
కూడి ప్రేమరతిసేయశుక్లశోణితములుగూడి-సుతుడాయె
గర్భమువీడిదాన-సుఖములేమరదానివిడిచిపెట్టరా॥సతొ

న్నాదివాకిళులమూసి దొంగలుండేచోటెల్ల శోధించిచూచి - తుర్యమైననాదమునను తుర్యమైనసమాధిని తానిల్వవలెరా॥ స॥ ఆనగురునిబట్టవలెరా - పది-యూనుగుఱ్ఱనిబట్టిబంధించవలెరా - వేరొక్కటని తెలియవలెరా తానునెళవైనయూచోట తానిల్వవలెరా॥సత్తు॥ తల్లిదండ్రులెందరున్న-యిట్లు, తమ్ములు బావలు తగచుట్టకొన్న - యెల్లబంధువులెందరున్న తానుతర్కిఁపో య్యేవేళతన కెవ్వరన్న ॥సత్తుచిదానంద॥

౬౩.—రాగము ముఖారి - చాపుతాళం.

పల్లవి.

ఎన్నిజన్మములెత్తి - ఎన్నితపములుజేసి -
ఈజన్మమెత్తితివిమనసా ।

అనుపల్లవి.

ఎన్నివిధములనైన నేరూపమునగురుని
ఎడబాయకుండవే మనసా ॥

చరణములు.

చదువులన్నియుచదివిసన్యాసిమార్గమున సంచరింపగనేలమనసా - చదువులలోనున్నసారంబుదీసుకొని సందేహములుమానుమనసా ॥ఎన్ని॥ అక్షరంబులునాల్గు కుక్షిలోనుంచుకొని అక్షరంబెరుగవేమనసా - అక్షరంబులమరుగు సుక్షేత్రమునజేరిసాక్షివై యుండవేమనసా ॥ ఎన్ని ॥ ఒకరుగాభ్యామధ్య వాసిగాజేసుకొని వాదములుమానవే మనసా - ఒకరదేహములోనున్న ఓనమాలుగుణియించి ఓంకారమునుజూడుమనసా ॥ఎన్ని॥ కలకాలమాత్మలోఁ

చరీముద్రకుకీలుదెలుసుకొనుండుమనసా - కీలుచమువులలో
ను-కఖాలుగుణియించికరకంతునిజామమనసా ॥ఎన్ని॥ త
ల్లిగర్భమునందుతొల్లిచదివినచదువు-మర్గ్నచదువవలెనీత్ర
మనసా-తల్లడముపడబోక తథాలు గుణియించి తత్త్వంబు
దెలియవేమనసా ॥ఎన్ని॥ ఎనిమిదిగఁడములనుయొగదోలివే
గమునవేదములుపాడవేమనసా - ఏమరకనెప్పుడు యూర
లవలుగుణియించి యెత్తియేనుగునెక్కుమనసా ॥ ఎన్ని ॥
కొండలేమనుదాటికుండలీయగ్రమున- అంఁదబాయకనుం
డుమనసా-కొండతారాయుడు కోర్కెలిచ్చేమంటు ఉండి
శ్రీగురుజేమమనసా ॥ ఎన్నిజన్మము ॥

౬౪.—రాగము పున్నాగవరాళి-చాపుతాళము.

పల్లవి.

బయలేభావనసేయరా-బ్రహ్మానందం
బయలేబాయకయుండరా ।

అనుపల్లవి.

బయలేభావనసేయబ్రహ్మానందంబాయె
భయభక్తిసద్గురునిపాదములేనమ్మి ॥బయలే॥

చరణములు.

రెంటినిబిగబట్టరాబిగియబట్టి మింటమనసుబెట్టరా -
జంటకేకులమధ్యసారముగనిపట్టి ఘంటనాదముచెవినంటి
కోరికతేలరా ॥బయ॥ గుండుమీదికిచేరరా-మీదికిచేరి-
ఖండభానునిమీరరా - నిండుపున్నమనాఁడుపండువెన్నెల
వైట-అంఁదబాయకసచ్చిదానందమునుపొందరా॥బయలే॥

సహజానందము జెందరా-ఆనందమొందిసరసిజాక్షునిజేరం
దరా-మహిమతో యేప్రొద్దు మాచిన్ని గోపాలవిహితము
తోడుతవెలయుతారక యోగిరా॥బయలే భావనసేయరా॥

౬౫.—రాగము ధన్యాసి - ఆదితాళము.

పల్లవి.

గురుపదేశంబా యెగదా-ఇక

అనుపల్లవి,

పురాకృతంబులు లేవుగదా ॥

చరణములు.

పరముతానని వరములొసగుచు - శిరమునమతన
కరమునుంచెను ॥ గురుపు ॥ పరాకువలదని చరాచరము
వొక - సరిగగనుమని స్థిరముజేసెను ॥గురుపు ॥ అరిట
నంటి-ఆరాటమణచియు- విరాట్టుదెల్పేస్వరాట్టుడగుమన॥
గురుపు॥ ధరనుగుత్తికొండపురమునవెలసిన- నరులబ్రో
చెడుమురారియగుశ్రీ ॥గురుపు॥

(పరశురామనరసింహదాసువారికీర్తన)

౬౬.—రాగము మాయామాళవ - చాపుతాళం.

పల్లవి.

ఇదిగోర గురుకీలకం జీవాఖినరా-

అనుపల్లవి.

అల్లదిగోరయోగసాధనము-ఇది॥

చరణములు.

ఇదిగోర శ్రీగురుపదద్వంద్వములు నీహృదయములోప

లవదలకదలచితే ॥ఇది॥ కొండమీదపెద్దగుండుయున్నది రా - గుండులోపన్నంపుగండియున్నదిరా - ఆగండిలో నొకపంటపండియున్నదిరా - ఆ-పండనుభవించితే బ్రహ్మ సంబ్రహ్మమురా॥ఇది॥ధాత్రిలోననొక్కగాత్రమున్నదిరా - గాత్రమునకుచిన్నయు నేత్రమున్నదిరా - నేత్రమందునగు రుసూత్రముదెలిసి - పాత్రమెరిగితేనుబ్రహ్మోస్మియవురా॥ ఇది॥ చూపులోనునీలరూపమున్నదిరా - రూపములోనొ క్కదీపమున్నదిరా - దీపములోనున్న తేజస్సుగలసితే-పా కముఁణగితత్వమసియవురా ॥ఇది॥ అయిదైనులు యిరు వైయొదై యున్నదిరా-ఐదింటిమీదనుఆత్మయున్నదిరా - ఆత్మనుమథియించిఅమృతముసేవించి - అనుభవమెఱిగి తే, అయమాత్మబ్రహ్మమురా ॥ఇది॥ గురువాక్యములునా లుగుగురుతెలుగవలెరా - గుఱుతెఱిగినంతనేపరములా నౌరా - పరశురామునివరనరసింహయోగికిపరమపదము బట్టబయలై యున్నదిరా ॥ఇదినోరగురుకీలకం॥

## శివపురమువారికీర్తనలు.

౬౭.—రాగము. ఛేగడ - త్రిపుటతాళము.

పల్లవి.

నిండుపున్నమనాడు- పండువెన్నెలబైటు॥

అనుపల్లవి.

నిండియున్నదియేమిరా- పన్నగుదేవా॥

చరణములు.

రెండుమూసియునేత్రామండలముననడాడ-దండిబాట

యున్నురదురా-సద్గురుదేవా॥ నిందు॥ కొదమతుమ్మెదలై సు
రొదలుచేయుచున్నవి- నమలకాంతలనుండురా- సద్గురుదే
వా॥ నిందు॥ చూపులోశివపురమూపు చూచినయప్పుడే -
దీపకాంతులు మేదురా- సద్గురుదేవా॥ నిందు॥

౬౮.—రాగము. మోహన - అటతాళము.

పల్లవి.

పొందుగానుసమాధిలో బయలందిసుఖమునుజెందరా॥

అనుపల్లవి.

ముందుగాగురుబోధచే ఆనందమునచెలువొందరా॥పొం॥

చరణములు.

రెండుశ్రోవలుమూసి వాయువు రేచకంబొనరించరా -
కుండలినిభేదించినంతట కుంభకంబొనరించరా॥ పొందు॥
మూటికవలత్రికూటమధ్యముసూటిబెట్టుకచూడరా- సూ
టిగానచొప్పటనీవు పగటిచుక్కనుగాంచరా॥ పొందుగా॥
ఆరుచక్రములరసి సూక్ష్మద్వారమార్గముచేరరా - చేరువ
గుపదియారింటనంతగ- పూరకంబొనరించరా॥ పొందు॥
మేలిమిగ శివపురవిహారుని మూలమిదియని తెలియరా॥
నీలతోయదమధ్యమందునవిజమునీవై వెలయురా॥ పొం॥

——(ఆదికేశవులవారి కీర్తన.)——

౬౯.—రాగము. కాంభోజి - అటతాళము.

పల్లవి.

చేరెమనీళ్లకుభూమెల్లతడిసెను తెలుసుకోర॥

అనుపల్లవి.

ఆరుప్రగణములకు యినుపమంటపమాయె తెలుసుకోర॥

చరణములు.

చింతమానుమీఁదచేమంతి పువ్వుపూసె తెలుసుకోర - దానిచెంతనున్న కోతిపులిపిల్లనీనెను తెలుసుకోర॥ చేర ॥
మూఁడుమూలలపెట్టెమూతతీసినేర్పు నేర్చుకోర-ఆమూతతీసితె పెద్దభూతముకనుబడును తెలుసుకోర ॥ చేరెదు ॥
అంబులపొదిలోనకొమ్ముటేనుగుబుట్టె తెలుసుకోర- ఆకొమ్ముటేనుగుమీఁదకుఱుచబాలుడుపుట్టె తెలుసుకోర ॥చేర॥
అమ్మమ్మయొకకప్పఅయిదుపాములమ్రింగె తెలుసుకోర - దానివాఁడినిండనిప్పులువసంతమాడెను తెలుసుకోర॥ చే ॥
గుడిమీఁదనొకనక్కకూతలుబెట్టెను తెలుసుకోర - దానిమెడమండెఘంటలుమ్రోతలుమ్రోగెను తెలుసుకోర॥ చే॥
తెలియనివారికియేడాదిగడువిస్తి తెలుసుకోర - దీనిఅన్వయంబూదూరిఆదికేశవుపెరుగు తెలుసుకోర॥ చేరెదు॥

——(వీరాస్వాములవారి కీర్తన.)——

౨౦.—రాగము. యమునాకల్యాణి - తాళము రూపకము

పల్లవి.

ఉన్నాడమ్మాచిన్మయప్రభువు-ఉన్నాడమ్మా॥

అనుపల్లవి.

ఉన్నాడునిజముగ సుఖముదెలిసిచూడ కన్నచోటనె ముక్తికాంతతో వెలుగుచున్నాడమ్మా ॥

చరణములు.

ఎనుబదినాలుగులక్ష జీవరాసులయందు నాటకధారుడై నటనసల్పెదుప్రభువు॥ఉన్నా॥ శుద్ధనిరంజనసద్ధర్మవంత

గ్రత్న్యముద్రద్విదళపద్మముసూక్ష్మ దివ్యమై వెలుగుచు ॥ ఉ
న్నా ॥ చూపురూపునంటిచూడగచూడగవింత- చూపు
చూచెటిచోటుచోద్యమై వెలుగుచు॥ ఉన్నా॥ ఆరుచక్రము
లపై ఆగ్నేయమందున్న - మేరుశిఖరమునందు తాండవ
కృష్ణుడు॥ ఉన్నా॥ మూడుమూర్తుల కాదిమూలమైన -
వీరస్వామిచేయుపదేశమందినవారికి॥ ఉన్నా॥

(విజయకవివరుని అష్టకంబులభావము)

౭౧.—రాగము. కల్యాణి – చాపుతాళము.

పల్లవి.

మొసలుమీదుగ తలలుక్రిందుగ
మొలచియున్నది వృక్షము॥

అనుపల్లవి.

మోదమలరగమింటిమీదను మదగజమువిహరించెరా ॥

చరణములు.

చిరిమిపట్టినబంటుకై వడిచీమయేనుగుమ్రింగెరా-సద
యుడౌమళ్ళూరిరాఘవసార్వభౌమదయానిధే॥ మొసలు॥
చింతబుట్టినకాతిమీదనుచింతమానొకటాయెరా- అంత
లోనెదానిలోను చేమంతిపువ్వులుపూచెరా - పంతమా
డుచుకప్పయొక్కటిపాముకై దిటిమ్రింగెరా - వింతగానిది
నిజముమళ్ళూరి వీరరాఘవదయానిధే॥ మొసలు॥ విర్రవీ
గుచుకోకవేయుచుఝూగెనుంచముమ్రింగెరా- గొర్రెయొ
క్కటియైనుపులులనుగొట్టినెత్తురుతాగెరా - చిర్రిచెట్టున
జాజిపువ్వులుశ్రీకరంబుగపూచెరా - ముక్తిపైకవలీఫలం

బులుపుళభూరిరామదయానిధే॥ మొనలు॥ కొంచెమానొ
కగృహములోపలకోటిసింహములుండెరా - అంచితముగ
నన్నిటినియొకసామజమువధియించెరా - పంచవన్నెచిలు
కలై దొకపర్వతమునుభక్షించెరా - మంచితత్వజ్ఞానమిది
మళభూరిరామదయానిధే॥ మొనలు ॥ ఒంటిపాటునరెండు
కోతులుజంటపిల్లలనీనెరా - కంటిననియొకనక్కకడుపున
కామధేనువుపుట్టెరా - వింటిననియొకమకరినవ్వుచుపీథిప
బ్బగులుబారెరా - జంటలీతెవియుంగమళభూరిసార్వభౌమ
దయానిధే ॥ మొనలు ॥ మానసంబునమనుజుడొక్కడు
మానునములుచునుండెరా - కానికానిమ్మనుచుదోమలుక
నకగిరినికదలించెరా - పేనుయొకయోజనముపుట్టెడుపెరి
కెవీపునమోసెరా - దీనజనమందారమళభూరిదివ్యరామ
దయానిధే॥ మొనలు॥ కన్నుగానకచేపయొక్కటికార్షుకం
బుననడిచెరా - మిన్నునేలనియనకవిసరిభ్రమించిగంతులువే
సెరా- చిన్నబాలుడుసర్పవాచ్యుడుతీర్చియాకొనిపోసెరా
అన్నరోయున్నతమూర్తిమళభూరిదివ్యరామదయానిధే ॥
మొనలు॥ ఉర్వివిూదమహానుభావుడువిజయకవియమరేం
ద్రుడు- వసుసతోదీనిదెలిపినవారెయష్టవధానులు- నిరుప
మాంబుధిచంద్రమళభూరివీరరాఘవదయానిధే॥ మొనలు॥

—(మహమ్మదుమ్యాన్‌సేర్ వారి కీర్తన)—

౭౨.—రాగము. ముఖారి - చాపుతాళము.

పల్లవి.

ఊమదుక్కొలిమిత్రిత్తులసమరపడపము తెలియవలెరా॥

అను పల్లవి.

వాదభేదములు అణచియాత్మలో శోధింపగవలెరా॥

చరణములు.

ఒక్కటిమొదలువృక్షములెక్కకుమిక్కిలికొమ్మలురా-
ఎక్కిచూచితెమొంతోపొడుగాకాశమంటినదిరా-చొక్క-
మైనపండొక్కకొమ్మనచేతికిచిక్కదురా - ఒప్పుగదెలిసిన
వారికిపండుయొద్దనెయున్నదిరా॥ ఊదు॥ రెండుత్రోవలు
కూడినచోట రేవుయొక్కటిరా - రెండురేఖల పద్మము
లోపల అఖండ తేజమనరా - ఉండజూచుకొనిఉనికితెలు
సుకొనిమొక్కబెట్టవలెరా- పండువెన్నెలనగాయెదుకొం
డలకెగువనురా॥ ఊదు ॥ మూడుయొకటిగాజేసేటందుకు
మూలంబిదిగోరా - కూడకట్టనుఅందుమొకటైకనెతాడొ
కటున్నదిరా - మూడురేవులుకూడినచోటముదితయున్న
దిరా - వేడుకతోసతిపతిరమియించె మేడొకటున్నదిరా॥
ఊదు ॥ నాలుగుపదవులనాణ్యము తెలిసె నమ్మికయున్న
దిరా- నాలుగార్లతనలోయిరువై నాలుగుయొక్కటిరా -
మూలంబిదిగో సాంఖ్యతారక యమనస్కభావమురా -
నాలాయములశోధించిచూడక వశముకాదుగదరా॥ఊదు॥
పంచభూతములు పంచవికారములు వదిలపరచవలెరా -
మించినదురితములారిటి మొదటికిత్రుంచివేయవలెరా -
పంచాక్షరములుభావములోపలపతియించగవలెరా- పొం
చిమహామ్రుదువాసేనుగురునిపాదముగనవలెరా॥ ఊదు ॥

॥రామబ్రహ్మమువారి కీర్తన.॥

83.—రాగము. నాదనామక్రియ - అటతాళము.

పల్లవి.

కారణగురునెఱుక తిరుగజన్మములేదు
గురుకరుణబడయవే చిలుకా॥

అనుపల్లవి.

గురుకరుణబడసితే యది మహామధురమైరమ్యమై
యుండునే చిలుకా॥

చరణములు.

మనసాటివారెల్ల మనముచూడగలేక మట్టిపాలైనారె చిలుకా - మనముఅటులమానిమనము సద్గురువెదకి పరమార్త తెలియవే చిలుకా॥ కార॥ కాలయముడుమనకు పొరుగింటివాడనుచు కాలాకాలము తెలియు చిలుకా - కాలాకాలములతెలసి కళలనంటిన గురునికంటినడుమను జూడుచిలుకా॥ కారణ॥ ఫాలలోచనుడందులీనుడై యున్నాడు నిజమనినమ్మవే చిలుకా - మూలకోనలోన మహామ్మాయయున్నది-అది తెలియవేనీవు చిలుకా॥ కారణ॥ రెండునొక్కటిజేసి రేచించిహంసను దండిగాగురిగనవె చిలుకా-దండిగాసద్గురుడుకుండలిపై నున్నాడుపండువెన్నెలనడుమచిలుకా॥ కార॥ ఆలుబిడ్డలుయనియాశించియుండినయాగురుని తెలియకే చిలుకా - ఆలుబిడ్డలవిడిచియాశాతీతుని యచ్చోటచూడవే చిలుకా॥కారణ॥ వదలకనుగురుసేవపదిలముగజేసితే-అదినీకుతెలుసునే చిలుకా -

అదినీకుతెలిసితెమదియా త్మగురిగని-ఆదివరునిగలయుచి లుకా॥ కారణ॥ గర్వపడకనునీవునిర్వాణపురమందుసర్వే శ్వరునిజూడుచిలుకా- మనరామబ్రహ్మముగురుడు రమ్య మైయున్నాడు-అతనిదెలియవేనీవుచిలుకా॥ కారణ ॥

—*(సున్నపుగుట్ట రాఘవులవారి కీర్తన)*—

౭౮.—రాగము. సావేరి - ఏకతాళము.

పల్లవి.

భ్రాంచేతునేనెంతో జెప్పినచెంచలముడుగవుభీత్మామనసా॥

అనుపల్లవి.

మంచిగురునిసేవించినావిక సందుతెలిసి భజియించవే ధు త్తెరి ॥ భ్రాంచేతు ॥

చరణములు.

పొంచిపొంచిబహుమంచిగురునిగృహ- పంచజేరవేభ డవాధు త్తెరి॥ భ్రాంచేతు॥ మంటిబొమ్మలాటంటనుదెలియ క-తంటలుజేసేవుతుంటవుధు త్తెరి॥భ్రాంచేతు॥ పట్టుగసున్న పుగుట్టరాఘవులపట్టువిడువకవే ఛీఛీలుచ్చా॥ భ్రాంచేతు॥

—(వేంకట గురువులవారి కీర్తన)—

౭౫.—రాగము. యమునాకల్యాణి - ఆదితాళము.

పల్లవి.

ఊరికిపోవలెగాపరబయలూరికిపోవలెరా॥

అనుపల్లవి.

ఊరికిపోవలెదారితెలుసుకొని మేరుశిఖరమున వెలిగెడి తావునకు॥ ఊరికి ॥

చరణములు.

ఏడుకొండలెక్కినదుమను మూడుయేర్లుదాటి-కూడిన నదులనువేడుకకనుగొని కూరిమితోనాగ్గురునివిడిచి॥ ఊరికి॥సన్నదిడ్డిమారిపున్నమువెన్నెలబయలులలో- కన్నవారికికనుగొనపోవలెతిన్నగసన్నపుదారితెలుసుకొని॥ఊరికి॥ కంటిలోవెదకినను కానకమింటిలోవెదకినను-కంటికిమింటికిరెంటికినడుమనుయొంటిగచీకటియింటిలోకనుగొని ॥ ఊరికి॥ జోడుపాములుండుచూడగపడిగలెత్తియాడు - కోడెకాడుమణిమంత్రముగోలుచు- నాడుచుకన్నులజాడలుగనుగొని॥ఊరికి॥పంచకోశములనుతనలోనెంచిచూడగాను- సంచితమిది శ్రీవేంకటగురుకృపతెలుసుకపోరా హంసనుగూడి ॥ ఊరికిపోవలెరా ॥

(బాలకృష్ణ దాసువారి కీర్తన.)

౭౬.—రాగము. పున్నాగవరాళి - చాపుతాళము.

పల్లవి.

ఎక్కడతిరిగినలేమురా జీవన్ముక్తి తనలోతత్త్వయమందిచూడరా॥

అనుపల్లవి.

ఎక్కడతిరిగినలేదు తనలోతానుమనసుచెదరక - ధిక్కరించిచూపులోపలకనుక్కవతోమనసునిలుపక॥ ఎక్క॥

చరణములు.

ఆరుమూడుయేడుతోమ్మిది - తొనిమిదిపన్నెండునాలుగుకమలమధ్యమందు-గురునిజేర్చికంటిబొమ్మనకలసిచూ

డక॥ఎక్క॥పదియుయిరువైయైదుముప్పైయారుతత్వజ్ఞాన
మందు - కనులమధ్యనుగుఱుతుశేర్చికంటిబొమ్మనుకలసి
చూడక॥ ఎక్క॥ ఊరివాకిటకూతలాయె-వినగవినగవింత
లాయెదాసుడేనివాసుడాయెబాలకృష్ణునిలీలలాయె॥ఎక్క॥

(శివయోగీంద్రులవారి కీర్తన.)

౭౭.—రాగము. తోడి - అటతాళము.

పల్లవి.

కొలువై యున్నాడె సద్గురుమూర్తి కొలువై యున్నాడె॥

అనుపల్లవి.

కొలువై యున్నాడుకోటిసూర్యులకాంతిమేడైనభ్రూ
మధ్యమేడలోపలతాను॥ కొలువై ॥

చరణములు.

లలనరోవినవేసద్గురుమూర్తిఅలివేణివినవే - ముల్లోక
ములకాదిముక్తికారణమతడు-పల్లవపాణిరోయుల్లాసము
లోనిపుడు॥ కొలువై ॥ ఉన్నతముగనుచిత్కళలలోచెన్ను
మీఱగను-మన్ననతోగురుమార్గముదెలిసితెసమ్మతాంగి
నీలోస్వామిసద్గురుమూర్తి॥కొలువై ॥ మట్టుమీఱగనుకుం
డలియనెపెట్టెయులోను - గట్టుమీఁదనెపుడుఘనతేజలింగ
మైకాంతిప్రకాశించుకలికిచిత్కళలతో॥ కొలువై ॥ ఎఱు
కలోపలనుమఱువులేనిమెఱుకతానగును- ఎఱుకెపరశివు
డనిమెఱిగినశివయోగిరుద్రుని-భావములోనెపుడుబాయ
కసద్గురుడు॥ కొలువై ॥

-(తరిగొండ వెంగమ్మగారి కీర్తనలు.)-

౭౮.—రాగము. నాదనామక్రియ - ఆదితాళము.

పల్లవి.

సద్వస్తువయందే నన్నునిలుపరా సద్గురునారాయణదేవ॥

అనుపల్లవి.

అద్వయమైపరమామృతమై ఘననిరంజనమై వెలుగుచునుండే॥ సద్వ॥

చరణములు.

ఇరువదైయైదిటిఁగూడి జనించిన యీస్థూలాంగమునే నొల్ల। సారవగుపదునేడింటినిఁగూడిన సూక్ష్మశరీరము నేనొల్ల। గరిమయవిద్యాకరముగవెలిగే కారణతనువు ను నేనొల్ల। సరవినిజాగ్రత్స్వప్నసుషుప్తుల జాడలు నెుందుట నేనొల్ల॥ సద్వస్తువ॥ సారెకుజననమరణంబుల కిరవైనసంసారంబును నేనొల్ల। భూరిసుఖంబును దుఃఖంబునునొసగెడు పుణ్యాపాపములనేనొల్ల। జారిమఱల దిగబడుహేతువులగుస్వర్గనరకముల నేనొల్ల। తీరనణుత్వంబున తెగనీయని దివ్యపదంబును నేనొల్ల॥ సద్వస్తువ॥ ఖరఖర మండల ముఖమండలముపై కలసిమెలంగుట నేనొల్ల। పరగమహాప్రళయమునుమూల ప్రకృతిని బొందుట నేనొల్ల। తిరిగిసుషుప్త్యాదులనుదయించేదీనదశలను నేనొల్ల। తరిగొండనృకేసరివెంకట గిరివరనిన్నికవిడువగ నేనొల్ల॥ సద్వస్తువయందేనన్నునిల్పరా॥

౭౯.—రాగము. కాఫి - చాపుతాళము.

పల్లవి.

చెఱుపదంటెనేమి-మంచిదియంటేనేమి - నీవు॥

దామె - తమగతిగానక్షతహాతహాలారమె - స్వామిశ్రీతరిగొండనరహరియూరమె - సాముద్రివాసుడే శివశంభుడామె ॥ శివుడంటెనేమికేశవు ॥

౧౨.—రాగము ఆనందభైరవి - అటతాళము.

పల్లవి.

జ్యోతి వెలుగుచున్న దమ్మా దానిలోతు తెలియ రాదెకొమ్మా

అనుపల్లవి.

పాతాళగగనకళాతీతమైసర్వ -
భూతములందుప్రఖ్యాతిగపరమాత్మ ॥జ్యో॥

చరణములు.

ఎవరిచేచిక్కదోయమ్మదానివిధమిట్టిదనిచెప్ప రాదుగదమ్మా - శివకేళిలోగూడిసిద్ధించుభావమైపూనిక్రమమునచాలబుధులందునయూత్మ ॥జ్యో॥ మాయలో మాయైనదమ్మ-దాని-మహిమ తెలియకూడదమ్మ - మాయకులోగానుమాయకువెలిగాను-రేయుబగలునొక్కరీతిగపరమాత్మ॥జ్యో॥నానారూపములైనదమ్మా-తిరిగి-తానుతానైయున్నదమ్మా - పూనిత్రికూటములోననిత్యానందజ్ఞానములోనిదానముగనాత్మ ॥జ్యోతి॥ కనకమయమైయున్నదమ్మా-తిరిగి-కనవచ్చుకనరాదోయమ్మా - ఫణితోడగూడుక పగలురేయొకరీతి-తనువులోపలనీలతామరసమునందు॥జ్యో॥ ఎటుకలోమెఱుకైనదమ్మాసర్వ-మెటిగేసాక్షియైయున్నదమ్మా - పరిమాణువుగావిశ్వపరిపూర్ణముగనాత్మగురుచంద్రుడగుశ్రీతరిగొండనరహరిరూపమున ॥జ్యోతి వెలుగు॥

౭౩,— రాగము ఆనందభైరవి - ఏకతాళము.

పల్లవి.

బ్రహ్మమేదో దెలుప[...]య్యా బ్రాహ్మణులారా ॥

అనుపల్లవి.

పరబ్రహ్మమేదో దెల[...]య్యా బ్రాహ్మణులారా ॥

చరణములు.

బ్రహ్మమేదో దెలుపర[...] భ్రాంతిలేక జీవునకు - కర్మ
రహితమైన మోక్షగతికిపో[...]నందుకు ॥బ్రహ్మ॥ నిర్మ
లాంతఃకరణులగుచు నిత్యంప్రకాశ[...]బ్రహ్మం - సత్యం
బని శ్రుతిమీరెఱిగినందుకు ॥బ్రహ్మ॥ బ్రహ్మకర్మములను జే
సుకొనుచు గాయత్రీమంత్రము చదివి - బ్రహ్మసూత్రమందు
నిష్ఠ బ్రహ్మాధిపతి బ్రాహ్మణోమమ దేవతాయను భావమెఱిగి
నందుకు॥బ్రహ్మ॥ రేపుమాపు సంధ్యవార్చి రేచించి ఓంకార
మందు - ఆపోజ్యోతి హంసోహంస్వాహేతియని మీరెఱిగి
నందుకు॥బ్రహ్మ॥ యజ్ఞక్రతువులనుచు మీరుతోయోగముయా
గము చేసి - భర్గో దేవస్యధీమహి సవితృర్భవతి భావం బెఱిగి
నందుకు ॥బ్రహ్మ॥ ప్రాణాపానవ్యానోదానసమానముల
నుగూర్చి - ప్రణవధ్యానులై వేదాంతం సోమపానం యజ్ఞం
స్వర్గం అని మీరెఱిగినందుకు ॥బ్రహ్మ॥ ప్రొద్దెరిగి ప్రొద్దున
లేచి ప్రొద్దు చెప్పి పంచాంగము - సుద్దులందు - ఓం నమోసిద్ధ
ప్రజాపతింధ్యాయేయని మీరెఱిగినందుకు ॥బ్రహ్మ॥ నిండు
వేడుకతో తరిగొండ భ్రమరాంబ - ఊర్ధ్వకుండలి ప్రణవమ
హాత్మ్యం సుబ్రహ్మణ్యగురుడని మీరెఱిగినందుకు ॥బ్రహ్మ॥

౮౮.—రాగము నాదనామక్రియ - అటతాళం.

పల్లవి.

జీవానీవునిను గానలేవా-నిన్ను ॥

అనుపల్లవి.

భావించిచూచితే బ్రహ్మమే కావా ॥

చరణములు.

పరగదేహముపాడిపందు - లోన-తరుచుగ పురుగులు తొలిచేటిపందు- తెరచాటు మాంసపుదిండు-దీని- తెరగెల్ల చక్కగా తెలిసి తెలుపుడు॥జీవా॥ మునుకొని తొమ్మిదితూట్లు-యీ-తనువు కారణమని తగనమ్మెదెట్లు- కనుగొను దీనిలో గుట్టు-చాల-పనిబూనివినబో తెబహుసిగ్గుబొట్లు॥జీవా॥ బలురోగములకిది బాట-దీని-వలపుసొలుపులెల్ల పడిగంట్ల మూట - వెలయుస్వప్నప్రాయమూట-నీవు- నిలిచి తెలిసి సేవునీకి దెబాట॥జీవా॥ పరగదేహముమంటిపాలు-యీపికట-సంసారమువిడిచి తేమేలు- సకలభోగములింక చాలు శ్రీ-అకలంకతరిగొండహరివై మమ్మేలు ॥ జీవానీవు ॥

౮౯.—రాగము ఆనందభైరవి - ఆదితాళము.

పల్లవి.

శ్రీగురునికొనియాడవేవో రాజహంసా ॥

అనుపల్లవి.

రాజయోగివై వెలుగుచుండవే వో రాజహంసా॥

చరణములు.

ఐదుపద్మములమీద రాజహంస-నీవు - ఆరోపద్మము

చూడవేవో రాజహంస॥శ్రీ॥దండి తేజమైయున్న దేవో రా
జహంస-చూడ - రెండు రేకులున్నా వేవో రాజహంస ॥శ్రీ॥
రెండు రేకులనడుమ రాజహంస - చాలనిండుగంగయము
నలుండు రాజహంస ॥శ్రీ॥ నిండుగంగ యమునలలో రాజ
హంస-చాల-చంద్రఖండకిరణాలుండు రాజహంస చంద్రఖం
డకిరణాలలో రాజహంస-నది- కుండలిరూపమున్నా దేవో
రాజహంస॥శ్రీ॥కుండలితుద వెళ్లె వేళ రాజహంస-అల్ల ఘో
షవినవచ్చు నేవో రాజహంస ॥ శ్రీ॥ నాదబిందువులలో రా
జహంస-కళ-భేదరహితమైయున్నా దెవో రాజహంస॥శ్రీ॥
సచ్చిదానందభావము రాజహంస-నీవు- సత్యమని తెలియ
వేవో రాజహంస॥ శ్రీ ॥ చిత్తనగత్వంపదము రాజహంస-
అల్ల-సత్తనగతత్పదము రాజహంస ॥శ్రీ॥ ఆనందమే అసి
పదము రాజహంస-పూని - తానుతానై యున్నా దేవో
రాజహంస ॥శ్రీ॥ కానవచ్చేచోటనాది రాజహంస-కను-
కంటచూచి తెలియవేవో రాజహంస॥ శ్రీ॥ చూపుమాపు
లొకటిజేసి రాజహంస-అందు చూడగలయలవునే వో
రాజహంస ॥ శ్రీ ॥ దృక్కు-దృశ్యములు లేక రాజహంస-
అందు- తెలివితుర్యమైయున్నా దేవో రాజహంస-నిర్గుణక్ష
త్రిమాత్రమె రాజహంస-అందు- నిర్మలపరిపూర్ణమవుదు
వు రాజహంస॥ శ్రీ ॥ పిండాండబ్రహ్మాండములు రాజహంస-
అందు-పెనగొ[illegible]నిలయమవునేవో రాజహంస॥శ్రీ॥ సంశయ
ములిడువవేవో రాజహంస-పరమ - హంసభావము తెలి
యవేవో రాజహంస॥ శ్రీ॥ ఖండభావములిడువవేవో రాజ

పామరజనులారామీరుభ్రమలువిడువండి॥

అనుపల్లవి.

భ్రమలువిడిచిభక్తితోగురుసన్నిధిచేరండి॥పామర॥

చరణములు.

నిత్యముగాదండి యీదేహము - సత్తుదెలియండి - సత్తుదెలసి నిత్యమైన సాక్షినివెదుకండి ॥ పామ ॥ సాక్షియనగనాత్మసుమ్మి - సత్యమనగనతడేసుమ్మి - సత్యమునుదర్శించిమీరు నిత్యులరై యుండండి ॥పామర॥ పంచభూతములనుమీరుబాగుగదెలియండి - పంచాతీతుడైన పరమాత్మనుగూడండి ॥పామర॥ ఆరుదొంగలుండేచోటునుఅందిచూడండి - అందిచూచితత్తులరెంటియదిమిప్పూదండి ॥పామర॥ పంచకోశములనుమీరుప్రత్యేకించండి - ప్రత్యేకించిపండువెన్నెలబయలుచేరండి ॥పామర॥ శ్రోత్రములందునాదబ్రహ్మము చోద్యముతెలియండి - విశ్రుతముగత్రికూటమందున సూక్ష్మముజూడండి ॥పామర॥ కాశికిపోయ్యేజనులార మరిగంగలోమునిగేనరులారా - గంగాయమునసదుమనుండేకాంతకుపేరడగండి॥పామర॥ ఎంతదూరమనుచుమీరు వెతలుపడకండి - కదలకమెదలకకన్నులనడుమనుకాశినికనుగొండి ॥పామర॥ హంసుడైన ప్రణవమంత్రము అజపాయువునండి - హంసనెరిగిమెలగిన పరమహంసలుగనరండి ॥పామర॥ ప్రణవమేబ్రహ్మమనుచు భగవద్వాక్యముతెలియండి - ప్రణవమందేముగ్గురుమూర్తులుపుట్టినకొండి ॥పామర॥ తత్వమస్యాదివాక్యములు

తప్పక తెలియండి - దేహమందే తత్వమనుచు తెలివిగజూడండి॥పామర॥ అరుదైనతంగేళ్ల యందుగురుని జూడండి- ఎఱుకతోను శేషాచలయోగిని జేరండి ॥పామర॥

౭౯.—రాగము హిందుస్తాని-ఏక తాళము

పల్లవి.

పంచవన్నె చిలుకలారపయనముగట్టండి ॥

అను పల్లవి.

ప్రయాణభేరి వేసిపరమగురుని జేరండి ॥పంచ॥

చరణములు.

తత్వములనేయీ ఱెనుబట్టితత్వరగానమువండి- తప్పకుండసూటిగమధ్య దారినిరన్నండి ॥పంచ॥ ఈఱెలుపూనిబాటలోను వేగమెరన్నండి- ఈమంత్రయములనుబట్టియెంచిత్రుంచండి॥పంచ॥ దారిలోనాగ్గురుదొంగలుదాచుకొన్నారు-దారితప్పిపో తెమీరుదక్క-బోరండి ॥పంచ॥ భీకరమైన దొంగలజూచిబిరుదులుపూనండి - ప్రణవమనేబాణాసనమునుబయలుపరచండి ॥పంచ॥ బయలుపరచిప్రణవమంత్రముపలుకుచునుండండి - పలుకులోనెదిరుగుచునాతనిపట్టిపెనగండి॥పంచ॥ రెండుతిత్తులంటీయూదిదిడ్డిదూరండి - దిడ్డిలోపలదిటవుగనాత్మను తేటగజూడండి॥పంచ॥ చూపులో నేచూడండిరూపులోనే కానండి - చూపురూపురెంటిజేసిసుందరాంగినిగూడండి ॥పంచ॥ చక్కగాభ్రూమధ్యమందునిక్కిచూడండి- శేషాచలయోగిగురుశ్రీ - చెంచురాజునుగూడండి ॥పంచవన్నె చిలుకలార॥

౯౦.—రాగము నాదనామక్రియ - ఆదితాళము.

పల్లవి.

చూచివత్తాము రారమ్మా శ్రీచెంచు రాజగురుని।

అనుపల్లవి.

చూచివత్తామురా రేసుదతులారమునను - శ్రీశుడై సహస్రారమందుశయనించియున్న గురుని ॥చూచి॥

చరణములు.

పరమహంసుడటపరమాత్ముండట - ప్రణవస్వరూపుడట ప్రణవమేపలుకుట - బ్రహ్మంబతడటపరమగురుండట - పరమపదంబటపరులకందడట - వరయోగులకటవరములిచ్చునట ॥చూచి॥ ఆత్మారాముడటఅఖిలాత్ముండట - ఆనందుండట అంతటనుండట - ఆదిమూలమటఅద్వయబ్రహ్మమట - అష్టాక్షరుడట అందరిసముడట - హరిహరాదులకటఅందనివాడట ॥చూచి॥ వేదాంతుండటవేదసారుడట - వేదవేద్యుడటవిశ్వేశ్వరుడట - విశ్వగర్భుడటవిమలపరుండట - వేదాతీతుడటవేరుచేయుడట - వేణునాధుడటవీనులకింపట ॥ చూచి॥ నిర్వికల్పుడటనిరంజనుండట - నిర్వికారుడటనిరుపాధికుడట - నిగమవేద్యుడటనిర్మలుండట - నీరజాక్షుడటనిర్గుణుండట - నిటలమందెయటనాసికవీధియట ॥చూచి॥ సూత్రధారియటసుందరాంగుడట - సర్వసముండటసర్వసాక్షియట - సర్వేశ్వరుడటసత్యవంధుడట - సర్వాత్ముండటసర్వము తానట - శేషాచలయోగినటస్థిరముగ నేలినారట ॥చూ॥

౯౧.—రాగము ముఖారి - ఏకతాళము.

పల్లవి.

హంసను దెలియరా - మదిలో సంశయింపకురా॥

అనుపల్లవి.

హంసను దెలిసి తేను నీకు హింసలన్ని దొలగిపోను ॥హంస॥

చరణములు.

కుంభీపాకనరకమందు కూలిపోకురా- కుటిలబుద్ధులట్టి విడిచి గురుని జేరరా- గురుసేవయందు నీవు కుదురుగ నిలువరా- గుఱుతు దెలిసి సూటిబెట్టి కుండలి దాటరా॥హంస॥ నిశ్చయంపు భక్తితోను నాసిక మెక్కరా- నాదబ్రహ్మములోపల జొచ్చి నాట్యములాడరా- నిర్గుణధ్యానము చేత నిజమును దెలియరా- నిటలమందున సాక్షి నిజూచి నిమ్మళించరా ॥హంస॥ మూడారువాకిళ్లయొక్క మూతను దెలియరా- ముమ్మూలకోనలోను మురియుచునుండరా- ముక్కోటి జలములందు మజ్జనమాడరా- మనోలయంబయ్యే యోగము మక్కువ దెలియరా ॥ హంస ॥ పెదవులు బంధించి నీవు ప్రణవము బలుకరా- ఆధారాది ప్రాకారములను అరసి చూడరా- మాతమై సమానభావము మనసున నిలుపరా- నిత్యముగా నివిహంగ మార్గము వెతలు విడువరా ॥ హంస ॥ సారమైన వర్ణత్రయమునకు సాక్షిని దెలియరా - సాకారధ్యానము చేత సత్యముగనవలెరా - శేషాచలయోగి చెప్పిన చిత్రము దెలియరా- శ్రీ చెంచురాజుగురుని వేడి స్వామిని జూడరా ॥హంసను॥

౯౭.—రాగము నాథనామక్రియ - ఆదితాళము.

పల్లవి.

వ్యర్థముకావద్దెచెలియావ్యసనముపడవద్దె॥

అనుపల్లవి.

వ్యర్థమనర్థముఝుహాసుఖకర్మము-
శ్రద్ధతోడగురుసరణిదెలియకను॥ వ్య॥

చరణములు.

ధనముచేతక్రొవ్వినీవుజననములెత్తేవే - మానకగురుపాదములనుమనసుననిలుపవే ॥వ్య॥ సొమ్ములయందాశవిడిచిసూటిబెట్టవే - చిత్రములైననాదములందుసొచ్చినిలువవే ॥వ్య॥ మారుతమందుపలుకుగూర్చినోరుమూయవే - పరమాత్మునిభజనచేతపరముగందువే ॥వ్య॥ ప్రణవధ్యానముచేతనీవుబ్రహ్మమునొందవే - భగవద్వాక్యమిట్టిదనుచుబాగుగదెలియవే ॥వ్య॥ గురుడుచెప్పినగుఱుతుదెలిసికన్నులుమూయవే - తుర్యముచేసినాసికమందు - దృష్టినడుపవే ॥వ్య॥ హేయమనుచు సంసారము వెతలువిడువవే - మాయబొమ్మలాట యనుచుమమతలువిడువవే ॥వ్య॥ చంద్రనాడియందుసూర్యునిసూటిగనడుపవే - సూర్యనాడి తుర్యముచేసిసోమునినడుపవే ॥వ్య॥ నిటలమందునవెలుగుచున్ననిజమునుదెలియవే - నడివీధియందుదిరుగుచునాట్యములాడవే॥వ్య॥ శ్రీచెంచురాజగురుడువుండేసహస్రారమంటవే - శేషాచలయోగిచెప్పినచిత్రముదెలియవే ॥వ్యర్థ॥

౯౩ — రాగము ఇంగ్లీషువర్ణమెట్టు - ఏకతాళము.

పల్లవి.

యోగివరులనిందలుచేసితె యమునిజేరేవు

అ ను ప ల్ల వి.

ముక్కువతోగురుసన్నిధిజేరితే-మోక్షమునొందేరు॥ యో

చ ర ణ ము లు.

నిందలుజేసెటిపందలజేరి తెనరకములొందేరు- నాసికములోదృష్టినడిపితేనాథునిజూచేరు ॥ యో ॥ ధనముధాంధులపొందుకలిగితెధర్మునిజేరేరు- తనువునందేతత్వముదెలిసితెదేవునిజూచేరు ॥ యో ॥ కాసులివ్వకఘనులనుదిట్టితెకాలునిజేరేరు - కుంభకమునసెక్కిపోతేకుండలిదాటేరు ॥యో॥ అహంకారముచేపెద్దలదిట్టితెఅంతకుశేరేరు - అజపకుండలిదెలిసితెపరమహంసులయ్యేరు ॥ యో ॥ ముక్కువతోమూడాశలనమ్మితెమోసపొయ్యేరు - ముక్కుదిక్కుమెక్కుబెట్టితెమూలముదెలిసేరు ॥ యో ॥ ఇహమునందుసంపదనమ్మితెనిడుములుపొందేరు -ఎఱుకకలిగితే మదిలోరాజయోగముతెలిసేరు ॥యో॥ కామముచేపరకాంతలగోరితెకష్టములొందేరు- గుహలనదుమశ్రీచెంచురాజగురునిజూచేరు ॥యో॥ సత్యముగానిలోకమునమ్మితెచిక్కులుపొందేరు - శేషాచలయోగినినమ్మినచిత్రముదెలిసేరు॥ యోగివరులనిందలుజేసితె॥

—*(జీవముక్తికాంతాసంవాదమైన పలపాట.)*—

౯౪.—రాగము నవరోజు - చాపుతాళము.

ప ల్ల వి.

కొండమీదిచిన్నదాన- కోటిసూర్యప్రభగలదాన।

అ ను ప ల్ల వి.

కొండనెక్కేదారిజెప్పవే -
ఓచిన్నదానకోరినిన్నే చేరవచ్చెనే॥

చరణములు.

దారినేనుజూపబోను దగ్గిరకురానుబోను-దారిజూపవశముగాదురా -ఓచిన్నవాడా - దారిజూపేగురునిజేరరా॥ కొం॥ శ్రీచెంచురాజగురునికృపనుస్థిరమైన దారిదెలిసి- శ్రీఘ్రమునవచ్చిచేరుము - ఓచిన్నదానా- చేరిసిగ్గుబారదోలేనే ॥కొం॥ కొండలోనుగుహాలుండుగుహాలుదాటిన కుండలియుండు-కుండలికిపైగానుందురా, ఓచిన్నవాడా, కోరిరానుతరముగాదురా ॥ కొం ॥ రేచకమునపూరకమునహంస పలుకు లోనగూడి - సొచ్చికుండలి శీఘ్రమె దాటుదు- ఓచిన్నదానా- జూచినీవుచోద్యమందేవే॥కొండ॥ చూపురూపుయొకటిజేసి చిన్నెవన్నెతళుకులుదాటి - చెంతజేరలేవుపోవోయి - ఓచిన్నవాడా - సుందరాంగులతోగూడుము ॥కొండ॥సుందరాంగియనగనీవేసొగసులాడియనగనీవే - చిన్నెలాడియనగ నీవేను - ఓచిన్నదానా - చిత్రమైనశయ్యదోరికేను ॥కొండ॥ అలవిగాదుశయ్యనెక్కహరిహరాదులకునైన - అందరానిపండునేనేరా - ఓచిన్నవాడా - అంటనలవికాదుపోపోర ॥కొం॥ చూపురూపుయొకటిజేసిచిత్రతళుకులువేగమెదాటి - సోహమునేభావముచేతను - ఓచిన్నదానా - చిత్రగతులకూడిమెలగేనే ॥కొండ॥ యోగులకునలవియవుదు భోగులకునలవిగాను - యోగనిష్ఠదెలియుపోవోయి ఓచిన్నవాడా-ఎక్క-

వైనపదవిజెందేవు ॥కొండ॥ శేషాచలయోగినినేనేచిన్న లాడిబ్రహ్మమునీవే - సాక్షియిద్దరమేకమైతేను - ఓచిన్న దానా - సత్యమైనబయలుచేరేము ॥కొండమీాది॥

౯౫.—రాగం మాయామాళవి - అటతాళము.

పల్లవి.

సువ్విసువ్వియోగులార-సువ్విసువ్విభక్తులార ॥

అనుపల్లవి.

సువ్విసువ్వియనుచుమీారలుసూక్ష్మమందరే॥ సువ్వి ॥

చరణములు.

శృంగాటకమనుతావుజూచియోగమనేరోకలెత్తి రాగమనేవడ్లుబోసిబాగదంచరే॥ సువ్వి ॥ కుంభకమనుచేట బట్టిపూరకంబునముంచియెత్తి - రేచకంబునపొట్టుచెరిగి రాశిజేయరే। సువ్వి॥ పాపలందెబాటయందుప్రణవమనుపలుకుగూర్చి - పగలురేయి యేకరీతిగ బలుకుచుండరే ॥ సువ్వి॥ సూటియనుఘటమునందుసోహమనుబియ్యమునచి పరసముగనుగంగయమునజలములుంచరే॥ సువ్వి॥ కుండలియనుపొయ్యిలోను కర్మములనుసమిధలునచి - మంట జేయుజంటతిత్తులంటియూదరే॥ సువ్వి॥ మంటజేసి పచనమైనవంటకమును యారగించి - సూటిగాను సహస్రారమందుపొచ్చినిలువరే॥ సువ్వి॥ పొచ్చినిలచి మచ్చికలరశ్రీ చెంచురాజుగురునికరుణ - శేషాచలయోగినిగూడి చింత జేయరే॥ సువ్విసువ్వియోగులార॥

౯౬.—రాగము. భైరవి - ఏకతాళము.

పల్లవి.

గొబ్బియనుచుపాడరే కుండలీశయనునకును॥

అనుపల్లవి.

నిర్భరంపుభక్తితోనునిటలమందుసూటిజేర్చి ॥ గొబ్బి ॥

చరణములు.

నాదానుభవునకునునాగేంద్రశయనునకును - నారదాదియోగిబృందమునమ్మియున్న బ్రహ్మామునకు॥ గొబ్బి॥ ప్రణవాదినాదములు ఘోరుకొని మ్రోయుగాను - పూనయోగులందరును మారుతమునుగూడివేగ॥ గొబ్బి ॥ మస్తుగలిగిచట్టలోన దిట్టముగను దిరుగుచుండిన - గుట్టుదెలిసినాసికములో నీటుగానుసూటిజేర్చి॥ గొబ్బి॥ ప్రణవము చుమదినిదలచిపలుకుయందుమనసునిలిపి - పరమాత్మునిభజనజేయుచుబాగుమీరను॥ గొబ్బి ॥ కంటిపాపలంటబట్టికొండలావువేగదాటి - మంటజేసిపాపములను ఒంటిస్తంభపుమేడనెక్కి॥ గొబ్బి ॥ సూర్యసోమవీధులందు శేషాచలయోగినేలిన - పారసాక్షుడైనశ్రీచెంచురాజగురువునకును॥ గొబ్బియనుచుపాడరేకుండలీశయనునకును ॥

౯౭.—రాగము - ఆనందభైరవి—చాపుతాళము.

పల్లవి.

హెచ్చరికగురురాజ యోగిజనహృదయ

అనుపల్లవి.

హెచ్చరికపరమాత్మ - యోఘకసుగుణాత్మా ॥ హెచ్చ ॥

చరణములు.

అందరానిచోటఆనందముగను - చందంబు దెలియు దురుసంతోషముననుు - సందడిలేకుండసకలంబుమఱచి- ఉందువనిచూచెదరు పొందుబాయకను॥ హెచ్చ॥ కోటి సూర్యులకాంతిమేటిరత్నములు - సూటిగాచెక్కినశయ్యపై నీవు - వీటుగానుందువనినిటులయుందునను పాటబాడు చునుందురుబోటులందరును ॥ హెచ్చ ॥ మునివరులందరు నునురియుచుండగను - మౌనయోగులుగూడి మక్కువలరగను - మానసమందుసద్ధ్యానంబుతోను - వేణునాదమువినుచువిమలవీనులను॥ హెచ్చ॥ సోహమనిపలికెదవు సొంపుతోడుతను - సకలజీవులయందు సత్యంబుగాను - శేషాచలయోగిని శ్రీకరంబుగను - స్థిరముగానేలితివి శ్రీ చెంచురాజగురుకృపను ॥ హెచ్చరికగురురాజ ॥

౫౭.—రాగము. శహాన - ఏకతాళము.

పల్లవి.

లాలిముద్దులహంస లాలిపరమాత్మ ॥

అనుపల్లవి.

లాలిముక్తికాంత-లాలిశ్రీకాంత॥ లాలి॥

చరణములు.

శ్రీగురుపాదములుచిత్తమునగోరి - సేవగావింపుడీస్థిర బుద్ధిమీఱి-సకలంబుమఱచియాసత్యమునుజేరి-సర్వయోగులహృదయసాక్షికలుషారి॥ లాలి ॥ ముగ్గురుమూర్తులు ముందుగానిలిచి- బాగుగానూచెదరుపొలతిపూరించి-మ

కుక్షవతో రేచించెదరుమగువనీతొట్టి- పింగళయిడగొలుసులను ప్రేమతో బట్టి ॥ లాలి ॥ సూక్ష్మనరత్నాలమేడలోపలను-నీటుగాపవళించినిదురబోవగను- పాటించియోగులు ప్రస్తుతించుచును- నటనములుచేసెదరునిటలమందునను॥ లాలి॥ కమలాక్షిముఖముసోముని గేలిసేయ- కులుకుపలుకులుచిలుకపలుకులనుగెలియ - కుండలిపైనుండికులుకుచును మెఱయ - కూడెదరుపవనమునుసూటిగా గదియ॥ లాలి॥ ఆరుకొండలమీదనరుదుగానీవు - మెఱయుచుందువుమేటిపరములోపలను-పరబయలుదైవమనిభక్తితోదలచి-వరములుగోరెదరువాంఛతోడుతను॥లాలి॥శృంగాటకమునందుసొంపుతోడుతను - సోహమనిపలుకుచును సుస్థిరంబుగను - సర్వకాలములందు సాక్షిగానిలచి- శేషాచలయోగికినిసేవగావించి॥ లాలిముద్దు॥

(వకుళాభరణదాసుగారి కీర్తన.)

౯౯.—రాగము - సావేరి - ఆదితాళము.

పల్లవి.

శ్రుణుగురువాక్యంచింతయతత్పదం॥

అనుపల్లవి.

చిన్మయపరబ్రహ్మానందబోధం॥ శ్రుణు॥

చరణములు.

త్యక్త్వామలమూత్రదేహం- భక్త్యాభజసద్గురుంనిర్మోహం॥ శ్రుణు॥ అజ్ఞానతమఃపటలాంశుమంతం - ప్రజ్ఞానం బ్రహ్మేత్యాజ్ఞాపయంతం॥ శ్రుణు॥ నిత్యానిత్యవిమర్శనశీ

లం-తత్వమసీతివాక్యానుకూలం॥శ్రుణు॥ సహజామనస్క-యోగవిలసితం- అహంబ్రహ్మాస్మీత్యనిశంవచంతం॥శ్రుణు॥ మాయాజగద్భ్రాంతివిరహితం - అయమాత్మాబ్రహ్మేతివదంతం॥ శ్రుణు॥ వకుళాభరణస్తోత్రపాత్రం - పోకల-శేషాచలస్యపవిత్రం॥ శ్రుణు॥

౬౫.—రాగము ధన్యాసి - ఆదితాళము.

ప ల్ల వి.

ఎక్కడతిరిగినలేదురా- జీవన్ముక్తి-పెక్కుదెరగులభ్రమసిచెడకురా॥ ఎక్కడ ॥

అ ను ప ల్ల వి,

నిక్కముగానే దెల్పెదనీకు - చక్కగానామాటనమ్మి - టక్కుడమరకములవిడిచి,దిక్కుసద్గురుపాదమనరా॥ఎక్క॥

చ ర ణ ము లు.

జీవహింసలు వలదువలదురా - ఈతనువులోపల దేవుడేజీవసాక్షిరా - గర్వముకోపగానిగురువుల - సవినయుడై సేవజేసిన అవగుణంబులుమానుపద్ధతి - లవలేశమైన దెల్పలేరు॥ ఎక్క॥ నిత్యసత్యవ్రతుడుగావలెరా- భగవద్గీతలత్యంతభక్తితోనమ్మవలెరా - క్రతువులుదాన ములు వేయింతో- అతులితంబుగజేసినను - జితేంద్రియుండుగాకను-సచ్చిదానందునిగాంచనేరవు॥ ఎక్క॥ దొంగ బుద్ధులువిడువవలెనురా - గుంటగట్టునకొంగవలెను నుండబోకురా - సంగరహితుడైన గురునిసాంగత్యమును జేసియష్టాంగయోగమహిమను-రంగుగాను దెలియనేరక॥ఎక్క॥

మేలుకీడులురెండుసమముగా - నిశ్చలత- తలచిత న్నయు
ముందవలెనురా- ఫాలభాగమధ్యమందున- నీలతోయ
దవిద్యుల్లేఖా - చెలువుగానుదానితుదను- సలలితాపర
మాత్మజూడక॥ఎక్క॥ ప్రణవమెప్పుడుబల్కవలెనురా-ని
త్యమునుపరమహంససోహమనవలెరా - అణవాదిపంచ
మలముల- అనుదినంబునుతొలచివైచి- అణకువతోడు
తహంసపంచాక్షరినిమెన్న నేరక॥ ఎక్క॥ ధరనుశేషాచల
గురుడురా నిక్కముగనరహరినారాయణుడేరా- అరమర
లేలరయికను స్థిరమతినిబూనినీవు- ధరణివకుళాభరణదా
సుని-ధీరవాక్యమునెరనమ్మక॥ ఎక్కడ ॥

—*(తేగరాయ భక్తుని కీర్తన.)*—

౧౦౧.—రాగము. వరాళి - ఆదితాళము.

పల్లవి.

నాదమువినరా జీవా॥

అనుపల్లవి.

నీకిదెపరమునకుత్రోవ॥ నాదము ॥

చరణములు.

నాదముదశవిధనాదంబులునై - మోదమలరగనుపాదుక
యున్నది॥నాద॥అష్టాక్షరినిదలచి-నీవష్టమదంబులనణచి-
అష్టకమలముననానందింపుచు అష్టపురంబుల- అంతుదె
లుసుకొని॥ నాద॥ సోహంబనినీవుదలచి- హంసోహంబని
నీవుకలసి । సోహంబనితాచూక్ష్మచునిశ్చలము- సోహంబ్రబ
హ్మముచోటుదెలుసుకొని॥ నాద ॥ ఇడాపింగళలుగడచి -

నడినాడిమధ్యమునవిలచి । నాటకధారునినయ నమధ్య మున- నాడుచుపాడుచునానందింపుచు॥ నాద॥ శేషాచల గురుదలచి-నీవు- శ్వేతలింగమునుదెలసి । శ్వేతలింగము నుసేవసేసినను-పాతకంబులునుబాసిపోవునిఁక॥ నాద॥ బా గుమీఁఅగాను - భువిలో భక్తిసల్పుచును । భవభయంబు లనుబారదోలెనని -బాగుగదెలసిన తేగరాయఁడని॥నాద॥

——*(దత్తాత్రేయులవారి మంగళం.)*——

౧౦౨.—రాగము సురట - ఆదితాళము.

పల్లవి.

మంగళం- మంగళం॥

అనుపల్లవి.

సద్గురుదేవా-మంగళం-మంగళం॥

చరణములు.

నాదబిందాయె బిందునాదమాయె- బిందుబీజమునం దుభేదములాయె - బిందుబీజమునందుభేదము దెలిసితె సందేహములేదాయెసర్వముతానాయె॥ మం॥ సత్తుతానా యె చిత్తుతానాయె- సత్తుచిత్తులురెండుసమరసమాయె- సత్తుచిత్తులరెండుసమరసము తెలిసితే,వర్తిలేనిజ్యోతివెలు గుతానాయె॥మంగళం॥ క్షరముతానాయెఅక్షరముతానా యె- క్షరముఅక్షరములురెండుశాశ్వతమాయె క్షరముఅ క్షరములరెంటిశాశ్వతము తెలిసితె- అమనస్కంబాయె - అంతతానాయె॥మంగళం॥ మాయకులోనాయెమాయకు మీఁదాయె-మాయయిరువదిమైదు మర్మములాయె-మా

యయిరువదియైదుమర్మము దెలిసితే-మాయమాయమా
యెమరియేమి లేదాయె॥ మం౹౹ చూపుతానాయెచూపుతా
నాయె-చూపురూపులరెంటిప్రాపుతానాయె- చూపురూ
పులరెంటిప్రాపుతాదెలిసితే- పాపములేదాయెపరమపద
మాయె॥ మం౹౹ నేనునీవాయెనీవునేనాయె-నీనామర్మము
లన్నినిజబోధలాయె - నీనామర్మమునిజముగా తెలిసితే-
మానాభిమానముమరినిల్వదాయె॥ మం౹౹ అంగలింగమా
యె లింగఅంగమాయె-అంగలింగముసందుఅనుభవమా
యె-అంగలింగములరెంటిఅనుభవము తెలిసితే-లింగరూప
మాయెలీలతానాయె ॥ మం ॥ గురుడుశిష్యుడాయె శిష్యు
డుగురుడాయె - గురువుశిష్యులసందుగుఱుతొక్కటాయె
హరియుదత్తాత్రేయగురుడని తెలిసితే- యెఱుకనిత్యమా
యె యేమిలేదాయె॥మంగళం॥

——*(పోకలశేషాచలాహ్వయుని మంగళం)*——

౧౦౩.—రాగము సురట - చాపుతాళము.

ప ల్ల వి.

మంగళంమంగళం- సద్గురుదేవామంగళం- మంగళం

అ ను ప ల్ల వి.

మంగళం-మంగళం సద్గురుదేవామంగళం-మంగళం

చ ర ణ ము లు.

నిర్గుణధ్యానులై నిశ్చయభక్తితో- నాదిహంసలవెంట
నాటిగదిరుగుచు నాటకుడున్నట్టికుండలి దెలిసిన — నార
దాదియోగులునమ్మిన దేవునకును॥ మం౹౹ ప్రణవాదినాదము

లుపికక్కుటిల్లుచు లేచి -వీనులయందునవింతగ మ్రోయగ-మనసులియ్యము చేసిమరిసద్దువినక నుమానసమందునధ్యానము చేయుచు॥ మం॥ సర్వాంతర్యామియై నిర్మలకారుడు సహాసా ౧రమందునసొంపుతో పవళించి సర్వసాక్షియైసర్వముతానై - చలనములేనట్టి సర్వార్థగురునకు॥ మం ॥ శేషాచలయోగిని శ్రీకరంబుగ నేలి - సర్వయోగులుమెచ్చ నిర్మలహృదయుడు సాకారరూపమై నిగమాంతవేద్యుడై సృష్టిలో వెలసిన శ్రీచెంచురాజగురువునకును॥మంగళం॥

—*(నాసరుమహమ్మదుగారి మేలుకొలుపు.)*—

౧౦౪.—భూపాలరాగం - చాపుతాళం.

మేలుకొనుమీ-తత్పదంబును - మేలుకొనుమీ-త్వంపదంబును - మేలుకొనుమీ - అసిపదంబును-మేదినిలో వెలిని - ఆత్మామేలుకొనవే॥ మేలు ॥ మేలుకొనకున్నావు యిహాములో, మేలుకొనకున్నావు పరములో, మేలుకొనకున్నావు-యీయిలకాలమధ్యములో॥ఆత్మామేలుకొన॥ తోలునోటనుతాలుమాటలు - తోసిపలుకుదురింతెకాకిల, లేదుజననము లేదుమరణము-లేదునీకెపుడు॥ఆత్మామే లేదుజననము లేదుమరణము - లేదుమృత్యువు లేదుసర్వము - లేదు లేదనిపలుకు ప్రణవము - ఆదిగనుగొనునూ॥ ఆత్మామే॥ మేలులో వెలిమేలుదెలిసియు, మేలులో వెలిమేలుగలసియు, మేలులో వెలిమేలునరసియు-మేలుకొమ్మనవే ఆత్మా ॥ వాదులాడుచువారువీరని- భేదమున-యేమోద మెఱుగక, లేదుజననము, లేదుమరణము లేదునీకెపుడూ॥

ఆత్మా ॥ ధిట్టముగ మేల్కొల్పజాలక - యిట్టియాత్మను నె న్నమానస, ధిట్టపడవని నిశ్చయించిన నీరసంబయ్యె ॥ ఆత్మామే ॥ ఛాలుపుష్పయు మేలుకొమ్మని - గాలమార్యు లుమూలమెఱిగిన, ఫాలలోచను విష్ణుకమలము - బోల జాలుమరే ॥ ఆత్మా ॥ ఇట్టియాత్మకునిద్రమెళుకువ - పుట్టబో దనిగుట్టుదెలిపిన, గట్టిగాలబుకరుణాసాసు వట్టిమాటల ను ॥ ఆత్మామేలుకొమ్మనవే ॥

(మేలుకొలుపు)

౧౦౫. — రాగము. భూపాల - చాపుతాళము.

మేలుకొనవే - తారకంబున, మేలుకొనవే - రాజయో గము, మూలమువినవే - శివునిగనవే - ముక్తిగైకొనవే ॥ జీవా మేలుకొనవే ॥ భూతపంచకమైనగృహమున - నూతగా గొనివిషయసుఖమున, దాతయీశ్వరుఁడై తిగదనీవికను మేల్కొనవే ॥ జీవా ॥ మానసాదిగుణేంద్రియంబులు - మ నసుతనియగసంచరింపఁగ, పూనితైజసుడై తిగదనీవిపుడు మేల్కొనవే ॥ జీవా ॥ ప్రజ్ఞలెల్లనుమాని నీనిజపాన్పుపై పవళించినాడను । ప్రాజ్ఞుడై యానందభోగము ప్రబలమే ల్కొనవే ॥ జీవా ॥ చూడయిరువై మైదుగురునిను - చుట్టు కొనియున్నారుపసులకు । యేడుమేడలజాడగని నీవిపుడు మేల్కొనవే ॥ జీవా ॥ ఇట్టివారలుజంటలై - మూడింటిలో నడిమింటవచ్చిరి । ఘంటకొట్టిరి వెలుగుగనియూ-రింటమే ల్కొనవే ॥ జీవా ॥ పాలపశ్చిమవీధివెంటనుతూర్పుగా - పై దిడ్డిదెఱచుక । గాలినడిచేవిధముయున్నది - కనుచు

మేల్కొనవే ॥జీవా॥

——*(మేలుకొలుపు)*——

౧౦౬.—రాగము. భూపాళం - చాపుతాళం.

పల్లవి.

హరిహరి-ఓజీవ - అనంతజన్మలెత్తివేసరితివి ॥ మేలుకో॥

అనుపల్లవి.

హంసోహమనెగురునిపాదపద్మంబులు-సేవింపగంటివి॥ మేలుకో॥

చరణములు.

శివుఁడనితెలియక జీవుండననుకొంటి - జన్మమునమసెను ॥మేలుకో॥ మూలాధారపరాశక్తి కుండలినదుమ-కళలుప్రకాశించె ॥మేలుకో॥జీవా ॥ నాల్గుదళపద్మనదుమ గణపతితోను - వల్లభశక్తితానై యున్నశ్వాసమునా । అరునూర్లుగణపతికర్పితముగాజేసి - హంసోహమనెజీవా॥ మేలుకో॥జీవా॥ స్వాధిష్టమునబ్రహ్మసరస్వతితోగూడి - సర్వముతానైనశ్వాసమునా ॥ ఆరువేలుబ్రహ్మకర్పితముగాఁజేసి - హంసోహమనేజీవా-మేలుకో॥జీవా॥ మణిపూరకమునవిష్ణు - లక్ష్మితోగూడుక - సర్వము తానైనశ్వాసమునా । ఆరువేలువిష్ణుకర్పితముగాజేసి-హంసోహమనెజీవా - మేలుకో॥జీవా॥ హృదయపద్మంబున-శివుఁడుపార్వతితోగూడి- అంతతానైయున్నశ్వాసమునా । ఆరువేలు శివునికర్పితముగాఁజేసి - హంసోహమనేజీవామేలుకో జీవా॥ కంఠపద్మంబున జీవుఁడుమాయాశక్తినితాగూడి

అంతతానై యున్నశ్వాసమునా। అందొక్కవెయ్యి జీవి కర్పితముగాఁజేసి-హంసోహమనె జీవామేలుకో ॥ జీవా ॥ భ్రూయుగ్మమున పరమాత్మపరాశక్తితో తాఁగూడి- స ర్వము తానై యున్నశ్వాసమునా । అందొక్క వెయ్యి పర మాత్మకర్పితముజేసి- హంసోహమనేజీవామేలుకో॥జీవా॥ పతితపావనగంగయమునసరస్వతి - భ్రూయుగ్మమునస్నా నమొనరజేసి । అగ్నిసూర్యచంద్ర మండలంబులమధ్య - హంసోహమనె జీవామేలుకో ॥జీవా ॥ దశవిధనాదములు దశదిక్కులనునిండి చెలగిఝుంకారములు సేయగాను । నడుమప్రణవ ఘంటనాదముఘనమాయె - దేవుఁడవై తి విమేలుకో ॥జీవా ॥ సహస్రదళపద్మమందు సద్గురునితో ను - స్వశక్తితానైనశ్వాసమునా । అందొక్కవెయ్యిగు రునికర్పితముగాజేసి - హంసోహమనె జీవామేలుకో ॥ జీ వా॥ హరిహరిశ్రీగురువు పాదములసేవ - ఆనందమాయె నుమేలుకో । అఖండమైనట్టి ఆనందవారాబ్ధివాలలాడు చుజీవామేలుకో ॥జీవా॥

---

శ్రీమద్వేదాంతసారుండును-సచ్చిదానందరహితుండు ను-నాదబిందుకళాతీతుండును - ప్రకృతిద్వయదోషరహి తుండునుఅశరీరుండును-అచలపరిపూర్ణుండును-శ్రీ-అచల మార్గప్రతిష్ఠాపనాచార్యుండునునైన - శ్రీ మద్రామమ దుగుశివరామదీక్షితులవారికటాక్షంబున - తదీయభక్తజ నులశుద్ధవేందాంత అచలకీర్తనలు.

౧౦౭.—*(శివరామదీక్షితులవారి వచనములు)*—

పదముజెందకము క్తిపదవిగలుగదు - మంచి-బుధులసే వలేకతత్వార్థబో తెలియదు- నీతనూద్భవములుఅతిసూక్ష్మ ములుఘనదత్పష్ణలనె వెతలు లేని గురుపదము - కులముగో త్రనామధేయగుణుతులేకనిపుడు విలయవృద్ధత్వములను వె లయబొందలేక-గుణుతుగవర్ణావర్ణములనరయలేక -సర్వ పరిపూర్ణమైయించుక బాధలేక - తరతరభావంబుతగులక కాలాంతరములేక - పరతత్వమైనగురుపదము ॥ పట్టిమూ టకట్టరానివట్టివృత్తబట్టబయలునై - యిట్టిదియని వచి యింపరాకగను బడనశక్యంబై నిండిన గురుపదము॥ నీమ కర్మములనేనిష్టలేకనిపుడు- భూమ్యాదిపంచ భూతముల పొలుపులేక - కామాదిశత్రువర్గవికారిగాకధర్మార్థకామ మోక్షములసత్యాంతములేక-భ్రామికలనుబెంపారనికేవలా త్మారాముడైనశివ - రామదీక్షితునిగురుపదము జెందక ముక్తిపదవిగలుగదు ॥

—*(అప్పగురుని కీర్తన.)*—

౧౦౮.—రాగము. నాథనామక్రియ - చాపుతాళము.

పల్లవి.

అదిగోచూడండిగురుపద మిదిగోజెలియుండి॥

అనుపల్లవి.

అదిగోచూడం డదరక బెదరక - కదలక మెదలకవదలకయున్నది॥ అది॥

చరణములు.

వట్టిమాటకాదుదానిపట్టబోతెరాదు - దిట్టముగాదా
నిగుట్టుతెలిసితె బట్టబయలునై గట్టిగనున్నది ॥ అది ॥
మత్తులైనవారుదాని మర్మమెఱుఁగలేరు -ఉత్తదిఁగమని
చిత్తమునిలిపితెసత్తుచిత్తుగాకసమరసమైనది॥ అది ॥ నలు
పుయెఱుపుగాకధూసరితెలుపుమెఱుపులేక- మెలకువతో
దానికీలుదెలిసితె-వెలుపలలోపలయేకమైయున్నది॥అది॥
గొప్పకొంచెమనకకనుజెప్పపాటులోగా- అప్పగురునిమది
నెప్పుడుతలచితెతప్పకయెందునుయొప్పగనున్నది ॥ అది ॥

—*(రామకృష్ణయ్యగారికీర్తన.)*—

౧౦౯.—రాగము. ఆనందభైరవి - ఆటతాళము.

పల్లవి.

వెయ్యరా - భేరివెయ్యరా - గురుమండ
లీలో-కొట్టరాధంకాకొట్టరా॥

అనుపల్లవి.

అయ్యగారిభావమందిన - అచలులకుజన్మంబులేదని ॥వె॥

చరణములు.

పంచభూతములతోను సహితమైనయెఱుకవిడువని -
మించినభావంబులెల్లవంచనలుకూడవనుచు॥వెయ్య॥లేఁత
తోచుదేహములలో-లోతుయేమో తెలియదిలను । పాత
కులు అయిననరులు ఖ్యాతిగాచెడిపోదురనుచు ॥వె॥ ము
దురుయెప్పుడుసత్యమనుచు వదురుచుందురుసకలజనులు-
బదులుయేమితోచనట్టిభాగ్యహీనులకందరాదని ॥ వె ॥
ఇలను తెలియకసకలజనులు కల్వరింతురుగాని భువిలో -

సలలితనిజబోధవారికి సర్వకాలము పొందదనుచు ॥ వె ॥ లోకులమాటలు యెపుడు కాకులకూతలుయని-లోకమందునమెలుక విడువని లోకులకునర్థంబుగాదని ॥ వె ॥ మూఢు మేనులునమ్మియున్న గూఢమైనా మెలుక విడువని। గాఢనిష్ఠనునమ్మియున్న ఖరములకు దెలియంగరాదని॥ వె ॥ రజ్జుసర్పవతుగనుండే ముజ్జగంబులువిడుచురీతిని - సజ్జనులనాశ్రయించినదుర్జనత్వము విడిచిపోవని ॥ వె ॥ వంధ్యపుత్రవతుగనుండే సంధియేమొ తెలియదిలను- బంధనములచే తదగిలేవారికిభావంబు లేదని॥ వెయ్య ॥ శివరామదీక్షితుల సవరణంభావంబుగనని- కావరంపుజనులకెల్లనుసావధానత గలుగదనుచు॥ వె॥ సూటిదగిలి రాజపేటబాట దెలిసిపోవనేరని_బూటకులకునిదియుగాదనిబుధులచేతను జెప్పబడునని॥ వె॥ వాసిగావల్లూరిలోనుభానురంబుగ మెలగుచుండిన-భూసురునిభావమెప్పుడువసుధలో జెప్పంగబడునని॥ వె॥ రామకృష్ణయరచనజేసిన రహస్యవచనములోనియర్థము-భూమిమీదనుసంచరించెబుద్ధిహీనులకందరాదని॥ వెయ్యరా॥

—*(సుబ్బకవిరాజుగారికీర్తన.)*—

౧౧౦.—రాగము. నాదనామక్రియ - ఆదితాళము.

పల్లవి.

ఏదిరా జననమరణము-నిజబోధగనిన॥

అనుపల్లవి.

లేదురా మోక్షనరకము ॥ ఏది ॥

చరణములు.

ఏది రాజననమరణము లేమ రాపరిపూర్ణమందున- వేద శాస్త్రాభ్యాసులను-మతవాదులను విడనాడెవారికి॥ ఏది॥ తానువచ్చిన చోటుదెలియదు - తనతోటిసర్వముతర్లిపో య్యేబాటదెలియదు - లేనిపోనిస్వప్నమందున యేనుగు లుగుఱ్ఱాలురథములు సేనలుసేనాధిపతులు యోనిసంభవ మైనతనువులు॥ఏది॥ రాజులేడుమంత్రిలేడురా - రాజొక్క డుంటే-రాజుకడియముయెందుకౌనురా - రాజులేనికయ్యా మాయెను రాజ్యకాంక్షలుదబ్బరాయెను - వాజపేయులు సోమయాజులు వాంఛకలలోవార్తలాయెను॥ఏది॥ దిక్కు లేనిదొరతనము-దిక్కునేదుంటే- నిక్కముయీజగములా నురా-దిక్కులేనితనువుయిలపై పెక్కుశాస్త్రములగాధ ఒక్కరెప్పపాటులోపల బొక్కపెట్టునిక్కుజీవుల ॥ ఏది ॥ ఎన్నటికినమ్మరానిది-క్షణభంగురమిది - యెన్నిపేర్లుపెట్టు కొన్నది - తన్నుదానుగన్నమోక్షంబన్నమాటలుసున్న లాయెను- ఉన్నదేపరిపూర్ణమందుననిన్నసేతెరదీసినప్పు డే॥ఏది॥ తల్లియీలింగాంగమందురు-తర్వాతదాని-పిల్లలు స్థూలాంగమందురు - తల్లిస్వప్నముపిల్లజాగ్రతతల్లిదారిపి ల్లకాయెను-యెల్లవారిబ్రతుకుభాగ్యము తెల్లజూడను తె ల్లనాయెను॥ఏది॥ వింతవింతలుతోలుబొమ్మలు-పరిపూర్ణజల ధిలో-ముంతలుయీకీలుబొమ్మలు - భ్రాంతిరహితమైనగు రుని చెంతజేరిషోడశాతురి-సంతతముద్వాదశాతురి చింత నజేసెడువారికి॥ఏది॥ నీవుబయలులోపలుంటివి-నీయందుబ యలు-నిండియున్నదెటుగనైతివి-నీవుబయలుసూచనైన

తేనిమిషమాత్రమునిలువలేవు- కేవలమునీశావలీవలస్థావరముపరిపూర్ణమాయెను॥ఏది॥ నందియముతీరనేటికి-మాయిందుకూరి-యిందుధరునిశిష్యకోటికి- యొందరులేదన్నబయలుయెందుజూచినసందులేకను - అందరిలోసుబ్బకవిశాజనుభవార్థమునిచటదెల్పెను ॥ ఏదిరా ॥

—*(కాలువకోటప్పగారియచలకీర్తన.)*—

౧౧౧.—రాగము. తోడి - చాపుతాళము.

పల్లవి

నమ్మిశిష్యులగాంచుమని శివరామదీక్షితు లన్నది॥

అనుపల్లవి.

కమ్ముకొనిబ్రంహ్మాండమంతయుకదలకగూడుచున్నది॥ న॥

చరణములు.

చలికియెండకువానకెప్పుడుఅలసటేమియులేనిది-పలుకుభావమ్మంటదదిగో పరబ్రహ్మరూపది ॥ నమ్మి ॥ ఆదిమధ్యాంతములు లేని యచలమైతానున్నది-సూదిమోపనుసందులేకను చూడశక్యముగానిది ॥ నమ్మి ॥ పరమపదకైలాసభావముగురువరేణ్యులకెఱుకది - ధరణిలోపలమూఢమతులకుందలంచనలవియుగానిది॥ నమ్మి ॥ పుట్టుగిట్టులుబారయెప్పుడుబట్టబయలై యున్నది - గుట్టుదెలియకనరులుయముని పట్టుబడిచనిపోయెది ॥నమ్మి॥ పంచభూతములెఱుకగూడిప్రపంచరూపకమైనది - గాంచనేరకదుర్జనావళి ఘనమునీచమటెన్నది ॥నమ్మి॥ జతలుదాల్చిజపితులైననుపుడమినదిగనరానిది - ఘుటీయలోగనవచ్చుగురునిక

భిముఖంబై యున్నది॥నమ్మి॥ కులమునాచారంబులెన్ని న కుటిలులనుఖండించెది - చలనయుచలపుసంధి తెలిసినజగ ద్గురువులమహిమది ॥నమ్మి॥ కలయుఘేల్కనిగాంచియణగి నక్రమముగానేగుఅంతది- ఎఱుకజేసినవేదశాస్త్రము తె ఱుకకేవిననొంపవి ॥నమ్మి॥ ఎఱుకచూచి యెఱుకబాసియె ఱుకెచనిపోచున్నది - ఎఱుకబాసినబ్రహ్మవేత్తలుయెఱుగ నికనేమున్నది ॥నమ్మి॥ నామరూపక్రియలులేకనునరులకది గనరానిది - స్వామిగాలబుగారికృపనుభక్తులపరమైనది॥ నమ్మి ॥ సాధనేమియులేకసద్గురుబోధరూపకమైనది- గాధ లన్నియుమీడజేసిన గాలబుగురుకరుణది ॥నమ్మి॥ ఎఱుకజగ ములున్నవనిబయలెన్నడెఱుఁగకనున్నది- మీఱుకసద్గురు సాక్షిశిష్యులకోరియుపదేశించెది॥నమ్మి॥దారిదప్పినూతగూ లినధనికునిచందంబది-అరుగుకరుగు పరుగువరుగుమొరు గుతరుగులులేనిది॥నమ్మి॥హరిహరబ్రహ్మాదియోగులుపరమ పదమనదగినది- గురుకీలుదెలిసినభాగవతులకృష్ణదాసుని కవితది ॥నమ్మి॥ చెప్పెద్వాదశిగురుడుగాలబుజేరియూరికె యున్నది -తప్పెషోడశిశాల్వకోటప్పబయలై యున్నది॥న॥

—*(పోకల శేషాచలార్యుని అచలకీర్తనలు)*—

౧౧౨ —రాగము నాట - ఏకతాళము.

పల్లవి.

వందనంబాచరించెద సందియంబులెల్లవీడి-సదా॥

అనుపల్లవి.

మందహాసనుందరపూర్ణేందువదనగురునికిపుడు॥వంద॥

చరణములు.

నాదబిందుకళాతీత-ద్వాదశాంతరీభావము - వాదము లరసాదరమునబోధ చేసినసాధునకును ॥వందనం॥ మిథ్యాజగద్భ్రాంతిభ్రూమధ్యగతాపోజ్యోతి- తథ్యమనుచు దెలియ జేసినబోధగురుస్వాములకును ॥వంద॥ దారుపురుషరీతిగాను అరయ షోడశాంతరనుచు - కరముభక్తి దెలిపిన వరగుణామణికినేడు ॥వంద॥ శశివిషాణములభంగినశ్వరంబౌమెటుకయనుచు అశేషపరిపూర్ణమిచ్చిన-శేషాచలుని గురునికిపుడు ॥వందనం॥

౧౧౩.—రాగము ధన్యాసి - ఆదితాళము.

పల్లవి.

భ్రాంతినిరసనంబయ్యెడి భావాభావాతీతముగనరయ్యా॥

అనుపల్లవి.

శాంతస్వాంతులగుచుమీరు
విశ్రాంతిమార్గమిదివినరయ్యా॥

చరణములు.

అతులితశుద్ధస్ఫటికసంకాశాపో - జ్యోతియేమెటుకని దెలియరయ్యా_అతిధీరతతోనాకొటుకనుగడచిన - గతియేసద్గతిగనరయ్యా॥భ్రాంతి॥ మృగతృష్ణాంబుగ్రహణసామర్థ్యము-అగణితసామాపగుణవంతులకునుగలదా - తగ నారీతిగభ్రమమూలంబగు - జగద్వర్తనంబనిమెటుగరయ్యా॥భ్రాంతి॥ క్షరాక్షరంబులమీాటినట్టియాపరవస్తుసాంగత్యముగానరయ్యా - హారిహారహిరణ్యాగర్భబ్రహ్ములు-

పరమునిక్షేపమేపరిపూర్ణమయ్యా ॥భ్రాంతి॥ కళకళజలస్థచం
ద్రప్రతిఫలవత్ - అలరుచున్నదికూటస్థమెఱుక - పలుదె
ఉంగులను భ్రమలువలదికను-చలనరహితా శేషాచలము
నుగనరయ్యా ॥భ్రాంతి॥

౧౧౪.—రాగము నాదనామక్రియ - ఆటతాళము.

ప ల్ల వి.

ఏమియుగానిదిది-ఇదియేమోగాని

అ ను ప ల్ల వి.

యేమనరాదిది ॥ఏమియు॥

చ ర ణ ము లు.

నాదబిందులుగాకనామరూపములేక - వాదభేదములే
కపాడుకయున్నది॥ఏమి॥ఎఱుకమఱుపులులేక యెగువదిగు
వలుకాక-యేమియుననరాక యేకమైయున్నది ॥ఏమి॥ ప్ర
కృతిద్వయములేక బీజజడములుగాక -కనులపండువుగాను
గనుపించుచున్నది ॥ఏమి॥ ఆనందమునుగాక ఆదితుదలులే
క-అఖండరూపమైఅంతటనున్నది॥ఏమి॥ సత్తుచిత్తులుగాక
సాక్షిత్వమునులేక - చలనమించుక లేక స్థిరముగనున్నది॥
ఏమి॥పలుకన్నబలుకకతలపన్నదెఱుగక - చలికియులికిపడ
కనిలచితానున్నది ॥ఏమి॥ కాలాకాలములులేక కారణము
నుగాక - కదలకమెదలకకళాతీతమైనది॥ఏమి॥ భక్తియోగ
ముగాకశక్తిజ్ఞానముగాక-పరమభాగవతులకుపరిపూర్ణమై
నది॥ఏమి॥సద్గురుకరుణచే శేషాచలాహ్వయుఁడు - సొంపు
తో దెలిసినస్వామియచలబ్రహ్మం ॥ఏమియు॥

౧౧౪.—రాగము—పున్నాగవరాళి - ఆదితాళము.

పల్లవి.

ఎంతోవింతగనున్నదమ్మ-సద్గురునిపదము॥

అనుపల్లవి.

ఎంతోవింతగనున్నదమ్మ ॥సద్గురుని॥

చరణములు.

ఎంతోవింతగనున్నదియెందునుతానేకమై-సందియంబులులేకనెప్పుడుసాక్షిరూపముగానిగురుపదము ॥ఎంతో॥ శివుడువిష్ణువుగాకసృష్టికర్తయుగాక-సత్తుచిత్తులుగానిసత్యమైనగురుపదము॥ఎంతో॥నామరూపములేక నారాయణుడుగాక -నాదబిందుకళాతీతమైనగురుపదము॥ఎంతో॥ ఆదిశక్తియుగాకఆధారమునులేక-ఆపోజ్యోతియుగానిఅఖండమైనగురుపదము ॥ఎంతో॥ అట్టిదిట్టిదనరాకఆత్మానాత్మలుగాక-ప్రకృతిద్వయములేకభాసిల్లుగురుపదము ॥ ఎంతో ॥ అచలగురునికరుణచే శేషాచలాఖ్యయుడు - ప్రపంచభ్రాంతులులేని పరిపూర్ణగురుపదము ॥ ఎంతోవింతగ ॥

౧౧౬.—రాగము - నాదనామక్రియ-చాపుతాళము.

పల్లవి.

వినరానదానందయోగి-నీవు।

అనుపల్లవి.

వినవేరువనివిశదపటుతువైరాగి-వినరా॥

చరణములు.

మూడుయేరులుకూడినచోట-దాని-మూలమెఱుగక నీవుమరియుచున్నావు॥వినరా॥ వచ్చిదానందముసమసిపో

లావ్వాయుఁడు-చెప్పినభావముచర్చించిచూడరా॥ యోగి॥

——*(వెంకటరావువారికీర్తన)*——

౧౧౯.—రాగం ఎఱుకులకాంభోది – అటతాళము.

పల్లవి.

అహోప్రపంచరహితమె - ఆదిమంత్రము॥

అనుపల్లవి.

మనశేషాచలగురుడుచెప్పిన - అచలమంత్రము ॥అహో॥

చరణములు.

ఆదితుదలులేనిదయ్యె ద్వాదశాక్షరిమంత్రము-వృత్తి ప్రకృతిద్వయరహితమే పెద్దమంత్రము ॥అహో॥ సాధకవిద్యలకందదయ్యెస్వామిమంత్రము- ద్వంద్వములనునశింపజేసేదొడ్డమంత్రము ॥అహో॥ వరయోగులకు నలవికాదువేదాంతమంత్రము- పరమజ్ఞానులుపట్టరానిపరిపూర్ణమంత్రము ॥ అహో ॥ కాలాకాలములేకగనుపించుమంత్రము -మూలములేనియెఱుకనువిడిచేముఖ్యమంత్రము ॥ అహో॥ రూపనామక్రియలులేనిపరిపూర్ణమంత్రము-గురు -గోప్యమైయుట్టిదట్టి దనరాకుండు విమలమంత్రము ॥అహో॥ ఎండమావులపగిదినుండుబ్రహ్మాండమంత్రము-కడుధీరముతో తెలుసుకొనినషోడశాక్షరిమంత్రము ॥అహో॥ తనువులునాల్గునులేనిపరతత్వమంత్రము - కనులుమూసిన తెరచినసదాగనుపించుమంత్రము ॥అ॥-పరాపరంబులుగడచినది పరిపూర్ణమంత్రము - పరమపదమైనయాబట్టబయలేమంత్రము॥అ॥ఎఱుక మరుపులు లేని వేదాంతమంత్రము-

ధరణిలో వెలసిన వేంకటదాసుడు తరించిన మంత్రము ॥ఆహా॥

౧౨౦.—రాగము సురట - చాపుతాళము.

పల్లవి.

మంగళం మంగళం-కేవలాత్మా-మంగళం - మంగళం

అనుపల్లవి.

మంగళం మంగళం- కేలాత్మా - మంగళం - మంగళం॥

చరణములు.

మనోవాచామగోచరంబునునై మహదహంకృతి రహితంబునునై -జననమరణసరణిగనుబడకను జేయుఘనతరావ్యక్తావ్యక్తముగడచినయచలము ॥మంగ॥మిథ్యాప్రపంచమువంధ్యాసూనునిపగిది-తద్గతకరణములుచిత్తాదులును-అధ్యారోపాపవాదంబులునుగాని-బోధమాత్రముఅధిష్ఠానాతీతము॥మంగ॥పంచభూతములనక పంచవర్ణములనక - అంచితజ్ఞానపంచేంద్రియములనక-పంచబ్రహ్మాలు పంచాశద్వర్ణములనక - పంచవింశతిమీఱినచంచలరహితము॥మం॥ సురనరపశుపక్షిక్రిముకీటకాది-చరములుస్థావరసంతతియునుగాక-పరమేష్ఠివిష్ణుశివాదులునుగాక - పరాపరంబులుగానితత్పరాత్పరాన్యము॥మంగ॥సద్గు[illegible]చలాహ్వాయుఁడు శ్రద్ధతో దెలిసినశు[illegible]ము- భేదరహితముసాధకాసాధ్యమునాదబిందుక[illegible]తపరిపూర్ణము॥మం॥

౧౨౦-తత్వకీర్తనల[illegible]పూర్ణము. 152408

## రాజయోగ అష్టాంగయోగములు.

యమ = వైరాగ్యము గలగడము.

నియమ = పూర్ణభక్తిని పొందడము.

ఆసన = సదా సంతోషమును పొందడము.

ప్రాణాయామ = మనోవృత్తులు నిలుపుట.

ప్రత్యాహార = నిత్యానంద వృత్తిని పొందడము.

ధ్యాన = సదా చిన్మయ స్వరూపమును జూచుట.

ధారణ = నిశ్చల దృష్టిని ధరించుట.

సమాధి = పరిపూర్ణాచలమందు నిరంతరము పొందడమే పూర్ణసమాధి.

## జ్ఞాని వ్యవహారములు.

1 వచ్చినది విడువడు, 2 రానిదికోరడు, 3 సహజము మానడు, 4 అయ్యేదానియందు యోచించడు, 5 కానిదానియందు కోరికయుంచడు, 6 వెనుకటిదానియందు వేడుక యుంచడు, 7 ముందుదానియందు ముచ్చటించడు, 8 అసత్యము పూనడు, 9 నిష్ఠ మరువడు, 10 నేను చేస్తానని యనడు, 11 వినరానిది వినడు. ఈరీతిని నియమములుంచే వాడే జ్ఞాని యనబడును సుమా?

ప్రశ్న:—విదేహకైవల్యము దేహేంద్రియాదులలో దేనికి సిద్ధించును?

ఉత్తరవు:—పంచమహాభూత నిర్మితంబులైన దేహేం
ద్రియాదులకు మోక్షము గావలయు నంటిమా? ఆత్మ
వాసస్థానమైన యీ శరీరము యెముకలు, నరముల
మాంసము, చర్మము మొదలైనవాటితో నొక గృః
మువలె నిర్మింపఁబడిన జీవత్వము గలిగి సర్వముచేత
చున్నను చేతనత్వముగల యాత్మ వస్తువు దీనికం
వేరై యుండుటచేత కేవల జడస్వభావంబైన దేవ
మునకు బంధమోక్షములు లేవనిన్ని, మఱియు ఇం
ద్రియములకు మోక్షము గావలయు నంటిమా? జ్ఞా
ద్రియములైనన్ను కర్మేంద్రియములైనన్ను రథముః
హాశ్వములవలె దేహమునకు వాహకములై బుద్ధియ
సారథివలన దేహమును నడిపించుటయు బుద్ధి సహా
ము లేకుండిన తమ కృత్యములు జేయనేరక జడస్వ
ములై యుండుట వలన జడములయిన యింద్రియ
లకున్ను బంధమోక్షము లు లేవనిన్ని, మరియు ప్ర
ములకు మోక్షము గావలయునంటిమా జీవరూప
ప్రాణవాయువు దేహమునకు చేతనత్వమునిచ్చి దే
ద్రియాదుల నడిపించినను గడియారపు యంత్రమః
స్వభావముచే చలించుటయేగాని తానేమియు నెఱ
కుండుటవలన ప్రాణరూపమైన జీవహంసయున్ను
మనిన్ని చెప్పఁబడుచున్నది. లేక జీవరూపమైన ప్ర